# సర్వోదయ సాహిత్యం

| | |
|---|---|
| సర్వోదయ సేవకులకు శ్రీ వినోబా హితోపదేశము (అచ్చులోవున్నది) | 0-4- |
| భూదానయజ్ఞము (రచన: శ్రీ ఉమ్మెత్తల కేశవరావు) | 0-2- |
| సంపత్తి దానము (రచన: జాజూజ్, అనువాదం: చుండి జగన్నాథం) | 0-2- |
| స ర్వో ద య ము (రచన: శ్రీయుతులు సురభి శేషశర్మ, యల్. శ్రీనివాసరావుగారలు | |

ప్రతులకు: భూదానసమితి, గాంధీభవన్, నాంపల్లి హైదరాబాద్.

| | |
|---|---|
| స్వ రా జ్య శా స్త్ర ము | 0-12-0 |
| గీ తా ప్ర వ చ న ము (వినోబా ప్రబోధం: శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారి అనువాదం) | 1-0-0 |
| శ్ర ద్ధా ం జ లి | 0-8-0 |
| త్యా గ మ హి మ | 0-8-0 |
| ఖా దీ త త్వ ం | 0-8-0 |

ప్రతులకు: వినయాశ్రమం, కావూరు,
(వయా) పొన్నూరు, గుంటూరుజిల్లా.

| | |
|---|---|
| ధ ర్మా మృ త ము | 0-2-0 |
| చావంటే భయమెందుకు? | 0-1-0 |
| అ భ య ం | 0-1-0 |
| చ ర ఖా శా స్త్ర ము | 1-4-0 |
| అ నా స క్తి యో గ ము | 0-8-0 |

ప్రతులకు: శ్రీ గాంధి ఆశ్రమము, గాంధిపురం, అంగలూరు పోస్టు, కృష్ణాజిల్లా.

# సర్వోదయ సమాలోచన

## శ్రీ వినోబా

అనువాదం
సంతపురి రఘువీరరావు

ప్రకాశకులు
భూదాన సమితి
గాంధిభవన్, నాంపల్లి, హయిదరాబాదు.

వెల: 0-4-0

ఫోటో: నల్లగొండజిల్లాలో మిర్యాలగూడెం తాలూకా పర్యటనలో ఒక తావున శ్రీ వినోబాజీ విశ్రమించిన రీతి. (శ్రీధర నాయుడుగారు, ఇన్ఫరమేషన్ డిపార్ట్మెంట్ ఫోటో తీసిరి) హైద్రాబాద్ గవర్నమెంట్ ఇన్ఫర్మేషన్ డిపార్ట్మెంట్ వారి సౌజన్యంతో ఇది ప్రకటితము.

# పరిచయము, ప్రస్తావన

ఆచార్యవినోబాభావేగారు 1953 "సర్వోదయ సమ్మేళనము "చాండిల్"లో గావించిన మహోపన్యాసము, హిందీలో ప్రకటించబడటమునుంచి తెనుగు ప్రాంతము ప్రజానీకాన్ని ఇంతవరకు ఆకర్షించలేదు. ఈ ఉపన్యాసము మన దేశపు భవిష్యత్తు సౌభాగ్యానికిమూల కందముగ నున్నదని చెప్పటకు సందేహము లేదు, కాబట్టి హైద్రాబాదు భూదాన యజ్ఞ సమితి దీనిని తెనుగు అనుకృతి లో ప్రకటించుటకు సంకల్పించినది. ఉపన్యాసములోని నాకు తోచిన కొన్ని మహావాక్యములను మొదటనే ప్రస్తావించుటకు నాకు నేనే ప్రోత్సహించ బడితిని. దీనివల్ల చదువరులు పూర్తి పుస్తకము చదువుటకు ప్రోత్సహించ బడుదురను ఆశ, విశ్వాసము నాకు కలిగినది.

## 1. మన ప్రభుత్వము యదార్థ స్వరూపము

"ప్రభుత్వము ఇంద్రజాల స్థానము, ఆ స్థానములో ఎవరు కూర్చున్ననూ వారిపై ఒక సంకుచిత నిర్ణీత పరాధీన పరిధిలో ఆలోచించవలసిన బాధ్యత పడుతుంది. ప్రపంచసరళి ఎటువైపు మొగ్గు చూపుతున్నట్లు అగుపడుతుందో అటువైపు నిస్సహాయంగానైన ఆలోచించవలసిన అవసరము యేర్పడుతుంది, కనుక ఒక మాటను మనసు అంగీకరించినను పరిస్థితి

జనితబుద్ధి మరొకమాట అంటే అది కుతంత్రం కానేరదు. ఇట్టి జాలికర పరిస్థితిలో ఉన్నాము మనము కాబట్టి దేనినైతే నేను స్వతంత్ర ప్రజాశక్తి అంటానో తన్నిర్మాణకృషిలోనే మనము తన్మయులము కావలెను. అప్పుడే మనము నేటి ప్రభుత్వానికి నిజమైన సహాయము చేయగలుగుతాం మన దేశానికి సముచిత సేవ చేయగలుగుతాం."

## 2. స్వతంత్ర ప్రజాశక్తి నిర్మాణావశ్యకత

"స్వతంత్ర ప్రజాశక్తి నిర్మాణము చేయవలెనని అన్నాను అంటె హింసాత్మక శక్తికి విరోధమైనదిగాను, దండశక్తికి విభిన్నమైనదిగాను, ఇట్టి ప్రజా వెల్లువ ప్రకటితము చేయవలయునని నాభావం. నేడు అధికారములో ఉన్న ప్రభుత్వానికి దండనశక్తి దత్తం చేసినాము. ఆదండనశక్తిలో ఒక మూల హింసాంశం నిబిడీకృతమైయున్నది. అది ప్రజలందరిచే సాముదాయకంగా దత్తం చేయబడింది. కనుక దానిని వేరు మార్గములో ఉంచ గోరుతాము, అది కేవలము హింసాత్మక శక్తి కాదు, అది దండశక్తి మాత్రమే. అట్టి దండనశక్తినికూడ ప్రయోగించే అవసరము కలుగనట్టి వాతావరణమును సృష్టించుటకు మనము కృషి చేయవలెనని ఉన్నది. మనము ఆ పని చేయగలిగితేనే స్వధర్మమును గుర్తించి తదనుసారముగ నడుచుకొన్నామని చెప్పవచ్చును. అట్లుకాకదండనశక్తియొక్క ఉపయోగములో సాధ్యముకాగల జనసేవపైననే విశ్వాసము పెట్టుకొని కూర్చున్నట్లయితే మనచే యే విశిష్ట కార్యనిర్వహణ ఆశించ బడుచున్నదో అదిమాత్రము మనవల్ల సాధ్యము

కాకుండ పోతుంది, మనము కేవలముబహుశరూపుల వారముగా నిరూపితమగుట కూడ జరుగవచ్చును.

3. భూసమస్య, శాసనము

"ప్రభుత్వము పైన మాకు పలుకుబడి ఉన్నది కదా? ప్రభుత్వమే శాసనం ద్వారా వినా నష్ట పరిహారము భూమి విభజనచేసేమార్గము ఎందుకు చూడరు? అని తరచుగ నన్ను ప్రతివారు అడుగుతూఉంటారు. నేను శాసనానికి, ప్రతి బంధకాలు కల్పించుటలేదు, శాసనానికి సౌలభ్యాన్ని చేకూరుస్తున్నాను, అందుకు అనుకూలవాతావరణమును సృష్టిస్తున్నాను. శాసనమునకు అనువుగ సుముఖ పరిస్థితులు కల్పించిన ఎడల అపని సులభసాధ్య మౌతుంది. శాసనము తయారు కావాలె కావలెనని అరుస్తూ కూర్చుంటే నేను కేవలము స్వధర్మ విహీనునిగ నిరూపితుడ నవుతాను. అది నాధర్మము కాదు. శాసనమైనాన రే, ప్రజాహృదయములో భూమివిభజనభావాలు సుస్థిరంగా నిర్మాణమగుటకు కృషిచేయుడము నాధర్మము. తల్లి తన పిల్లకు పాలిచ్చుటకు ఏశాసనాన్ని పాటిస్తున్నది? మా సర్వ జీవితమును సమృద్ధముచేయగల గొప్పశక్తి మనిషిహృదయములో ఉన్నది. మానవుడు ప్రేమపై విశ్వాసము కలిగి ఉంటాను. ప్రేమనుంచి జన్మించినాడు. ప్రేమతో పరిపోషితుడౌతాడు. తనకుప్రియమైనవారు, అంతిమ దర్శనమునకు వస్తే మితిలేని ప్రేమతో వారిని తనివిదీరచూచి మాయలేక, మాయలేక, కన్నులు మూస్తాడు. ఈ విధముగ మనము, నిత్యము ప్రేమానుభూతిని పొందుతూ, ప్రేమకుగల అమోఘమైన శక్తిచే ప్రభావితులమౌతూ, అప్రేమనే విస్మృతపరిచి

సామాజిక స్వరూపములో వికసితముచేయకుండా, శాసనమో శాసవమని పలవరిస్తూ వుండడమువల్ల, జనశక్తి నిర్మాణముచేసి ప్రభుత్వము ఆశిస్తున్న సహాయమునుచేయలేకుండపోతాం."

## 4. భూదాన కార్యక్రమము, దానిమహత్తు

"మొట్టమొదటి పని భూదానయజ్ఞము. వివిధ అభిప్రాయాలు గలవారు యీ కార్యక్రమమును ప్రశంసించినారు. కాబట్టి మనమంతా కలసి యీ కార్యక్రమాన్ని అమలు పరచుటకు కృషిచేసినచో బహుశః వచ్చే ఎన్నికల వరకు అభిప్రాయ విభేదాలు మాసిపోవచ్చు. ఉత్తమోత్తములైనట్టి వ్యక్తులు ఎన్నుకోబడవచ్చు, తర్వాత ఏర్పడు ప్రభుత్వము ఎంత పటిష్ఠంగా ఉండగలదో చెప్పవలసిన పనిలేదు. కాబటి యీ కార్యక్రమము మనము కొనసాగించవలసిఉన్నది. ఐదు కోట్ల యకరాలభూమి సేకరించు బడునంతవరకు మనకు శాంతిలేదు. వచ్చే సంవత్సరమువరకు 25 లక్షల యకరాల భూమి ఎట్లయిన సేకరించ బడవలసిందే. భూమి సమస్య మౌలికమైనదని, అందువల్ల ముందు భూమి సమస్యనే తీసుకున్నాను. భూమి సమస్యతో పోలిస్తే సంపద సమస్య అంత మౌలికంకాదుకూడా. ఇది ఇందుకు ఒక కారణమయింది. తెలంగాణాలో పర్యటిస్తున్నప్పుడు పరమేశ్వరుని ఆదేశమయింది. తదాదేశమును పురస్కరించుకొని కార్యసాధనకు పూనుకొన్నాను. సంపత్తిదాన యజ్ఞమునుగురించి నేనిక్కడ విస్తారముగా చెప్పదలచుకోలేదు. ఒకటిమాత్రము మీ అందరికి చెప్పదలచుకున్నాను. మీలో ఎవరి దగ్గరయినా మాటఉన్న

ట్టవుతె ఆ మాటను ముందు వదిలిపెట్టి అటుపిమ్మట ఇందులో చేరండి. మీ మీ మిత్రులలో ప్రేమతో దాతృత్వ భావాన్ని ప్రచారము చేయండి. ఇవి రెండు పరస్పరం అనుసంహితమై ఉన్న పనులు."

## ౫. భూమి వ్యవసాయము, కార్మికులు

నేను కర్తృత్వ విభజనను కోరుతున్నాను. ఎంతమంది కార్మికులున్నారో వారందరు ఇతరుల చేతిలో పని చేస్తున్నారు. వారు పనయితే చేస్తున్నారు, కాని వారిలో కర్తృత్వమన్నది లేదు. బండినడుస్తున్నది కాని మనము బండిని కర్త అనగలమా? ఎందుకనలేమంటే అదినిశ్చేతనమైనది. కనుక అక్కచేలలో, పొలాలలో పనిచేస్తున్న వ్యవసాయ కార్మికులు నిశ్చేతనులుగ పనిచేస్తున్నారు. అట్లాకాక వారు సొంత ఆలోచనతోను, స్వచ్ఛందంగాను పనిచేయ వలయునని నేను కోరుచున్నాను.

"ఒక కార్మికుని కన్న కొద్దో గొప్పో డబ్బున్నవాడే కాస్త తెలివిమంతుడై ఉంటాడు. నిజమే కాని దేశములో మొత్తముమీదగల కార్మికుల ధీశక్తికి మించినది లేదు. అంతటి ధీశక్తి లేక బుద్ధి బలము మన దేశమునకు సదుపయోగము కానిచో ఎంతో గొప్పనష్టము కాగలదు. కాబట్టి కార్మికుల బుద్ధి బలము అది యే పరిస్థితిలో ఉన్నను పూర్తిగ ఉపయోగించ బడవలెను. వారి బుద్ధి బలమును వృద్ధిపరచుటకు చేయబడు కార్యక్రమములో వారికి భూమి నివ్వడము గాక చదువు నేర్పడము కూడ ఒకభాగముగ ఉండవలయును."

## 6. అహింసాత్మక రాజ్యమంటే గ్రామరాజ్య నిర్మాణము.

"ఎప్పుడైన సైన్యాధికారమునుండి విముక్తిని మీరు కోరుతున్నట్లయితే పరమేశ్వరుని అనుసరించండి. పరమేశ్వరుడు మనుష్యులందరికి తెలివి పంచి ఇచ్చినాడు. అంతేకాదు సకల జంతుకోటికి తెలివినిచ్చినాడు. తేలు, పాము, పులి, మానవుడు మొదలగు జీవులన్ని తెలివిగలిగి మెలగుచున్నవి. వాటిలో ఎక్కువ తక్కువలు ఉండవచ్చు. అయినా ఈశ్వరుడు జీవులన్నిటికి తెలివినిచ్చి మీ మీ జీవనాలకు దీని నాధారంగా పెట్టుకొండని ఆదేశించినాడు. అప్పుడు ప్రపంచము ఎంతో చక్కగా నడవడం ప్రారంభించింది. రాగా రాగా భగవంతుడు ఉన్నాడా లేడా అన్న అనుమానము జీవకోటికి కలగడమువరకు వచ్చింది. అట్లే అధికారమును పంచివేయుట ద్వారా ఎటువంటి పరిస్థితి యేర్పడవలెనంటే అసలు ప్రభుత్వమన్నది ఉన్నదా? అన్న భావము ప్రజలకు కలగవలయును. భారతదేశములో రాజ్యాధికారమే లేదేమో అని అంతా అనుకోవలెను. అప్పుడుగాని మన రాజ్యము అహింసాత్మకము కాదు. అందుకే గ్రామ రాజ్య నిర్మాణము మరియు ప్రతి గ్రామానికి స్వయంనిర్ణయాధికారము ఉండవలయునని కోరుచున్నాము. అసలు జాతీయ నిర్మాణమంటే నే గ్రామ నిర్మాణము అన్న అర్థము స్ఫురించవలెను. గ్రామ నిర్మాణమునకు చేయవలసిన అవసరమైన సహాయపు పనులు ఢిల్లీలో చేయబడవలెను. ఇది సముచితము. ఇది మన కార్యక్రమములోని రెండవ ముఖ్యాంశం."

## 7. శ్రమ, గౌరవము

"ఇదిగాకను మరొక విశేషముంది. కాలం మారింది. శ్రమకు గౌరవము ఏర్పడేరోజులివి. కనుక ప్రతి ప్రాంతము లోను కేవలము శ్రమదానముపై సంస్థను నిర్మాణము చేయ గలిగితే చేయడము మంచిది. నూలు సమర్పణ ఉద్యమము బాగా వ్యాప్తి చెందితే ఇటువంటి సంస్థలను మనము సులభ ముగా నిర్వహించగలము. మరియు తేజస్వులైన కార్యకర్తలు సిద్ధము కాగలరు. మనము చేస్తున్నపని సంకుచితము కారాదు. వీరలు "సర్వోదయ వాదులు" అను మాటలు అసలు వినవే రాకూడదు మనము కేవలము మనుష్యమాత్రులము. మానవా తీతమైన శక్తిగలవారము కావు; మనమంతా సాధారణ ప్రజా నీకములో కలిసిపోవలెను. వీరితోపాటు సామాన్య మానవ మాత్రులము కావలయును.

చాండిల్
7 మార్చి 1953

ఉమ్మెత్తల కేశవరావు
సంయోజకుడు
హైదరాబాదు ప్రాంత భూదానయజ్ఞసమితి.

# సర్వోదయ ఘోషణా పత్రము



## కిశోర్ లాల్ భాయీ సంస్మరణ

ఇవాళ నేను శరీర అస్వస్థతతో నే మీ ముందుకు రావలసి వచ్చింది. అందుకు క్షమాపణలు కోరుతున్నాను. నా అభి ప్రాయాలను సాధ్యమయినంత క్లుప్తముగా మీ యెదుట పెట్టుటకు ప్రయత్నిస్తాను. శంకర్ రావు దేవ్ వలె నేనుకూడా నా ఈ ప్రసంగాన్ని పూజ్యులు కీ॥ శే॥ శ్రీకిశోర్ లాల్ భాయీ సంస్మరణతో ఆరంభంచేయుగోరుతాను. ఈశ్వరుడు మా అంద రికీ అప్పగించిన ఒక మహాకార్యములో ఈశ్వరుని ముందు యావత్ప్రజానీకముముందు, మేమందరమూ నిర్వహించుటకు శక్తి వంచనలేకుండా పాటుపడగలమని దీక్ష పూనిన ఆ మహా కార్యములో, ఆయనకూడా తుదిఘడియల వరకూనిమగ్నులై ఉన్నారు. కర్మలో అకర్మ, అకర్మలో కర్మ, ఒక దానిలో ఒకటి అంతర్లీనమై ఉంటుందని గీత మనకు జీవిత రహ స్యాన్ని బోధిస్తున్నది. కిశోరీలాల్ భాయ్ శారీరకంగా చాలా దుర్బలులుగా ఉండిరి. కనుక స్థూలకర్మ అని దేనినైనా లేమనం అంటామో అది వారికి చేతగాకపోయేది. అయినా, ఇరవై నాల్గుగంటలూ ఏదోఒకటిచేస్తూనేఉండే వారాయన. ఆయన చేసిన పనిమాత్రం దిఙ్మాత్రంగా చేచూపునకు స్థూలంగా అగు

పడకపోయింది. ఏమీ చేయలేనిస్థితిలో నిష్కర్మలుగా ఉండ గలుగుట ఎంతటి ఘనకార్యం కాగలదో ఆయన మనకు నిరూపించి చూపినారు. ఎవరిహృదయాలు విశుద్ధ స్ఫటికము వలె వినిర్మలమై ఉంటవో, ఎవరి రాగద్వేషాలు పరమేశ్వరుని కృపా కటాక్షములచేత పునీతం అయినవో ఆట్టి సజ్జనుల కేవలం ఉనికి మాత్రమే ఎంతో అమోఘమైన కార్యసాఫల్యా నికి కారణభూత మవుతుంది. జగతిలో అప్పుడప్పుడు జనన మొందే ఇట్టి మహాపురుషులలో కిశోర్ లాల్ భాయి ఒకరుగా నేను పరిగణిస్తాను. బాపూజీ అనంతరం ఆయన మాకు పట్టు కొమ్మగా ఉండేవారు. తమ సహజ సౌజన్యంతో మమ్మలను చూచుకొనేవారు మనలో ఎవ్వరిలోనూ అంతటిశక్తి ఇంకా ప్రకటితంకాలేదు. కనుక వారి అస్తమయం మనకొక తీరని లోటు. పరస్పర సౌహార్ద సామరస్యాలతోగాని మనమాలో టును పూరించలేము. భగవత్కార్యం మనచే పూర్తి కాగలు గుటకు అవసరమగు సౌహార్దం, సౌజన్యం, సద్భావం, సౌభ్రా తృత్వం మనలో ఉండగలవని నేను ఆశిస్తున్నాను.

## పూర్వ కార్యకలాపాల సింహావలోకనము

మనమందరము కార్యకర్తల తరగతికి చెందినవారము. సమ్మేళనమునకు వచ్చి మన అభిప్రాయాలను పరస్పరం ఒకరి కొకరం తెలుపుకొంటాం. ప్రసంగాలుచేస్తాం. ప్రసంగంచేయుట కూడ పనే. ఇక్కడ ప్రసంగం నకృత్యం కానేరదు. అది ఉద్యమ నిర్వహణలో ఒక భాగమే కాగలదు. సంవత్సర మంతా కొంత పనిచేసి తర్వాత ఒకచోట కూడుతాం. చేసిన

పని భగవంతునికి అర్పించి వచ్చే సంవత్సరానికి క్రొత్త కార్య క్రమాన్ని ఏర్పరచుకొని పోవాలని అనుకొంటాం. అంతా ఒకచోట కూడినపుడు ఒకరి ఆలోచన అభిప్రాయాలూ మరొకరికి తెలుపుకొనే అవకాశం లభిస్తుంది. ఈదృష్టితోనే మనం మన పూర్వ కార్యకలాపాల సింహావలోకనం చేసుకో వలెను. ముందు అనుసరింప వలసిన కార్యక్రమ విధానములను కూడా నిర్ణయించుకొనవలెను. కార్యవిధానము, కార్యక్రమము, కార్యనిర్వహణము ఈమూడింటిని గురించి బాగా ఆలోచించు కొనవలెను.

## నేటి ప్రపంచ పరిస్థితి

ప్రపంచపు ఏ మారు మూలలో నివసించువారమైనా యావత్ప్రపంచపు పరిస్థితిని గమనించకుండా ఎవరిమట్టుకు వారము మడికట్టుకొని ఉండగలుగుట సంభవం కాదు. ప్రపంచంలో ఏయే విభిన్నశక్తులు ప్రభావవంతమైన పాత్రలను నిర్వహిస్తున్నవో, ఏయే భావాలు ఏయే సిద్ధాంతాలకు మధ్య సమైక్యత సంఘర్షణలు జరుగుతున్నవో సతతమూ వాటిపైవు దృష్టి ఉంచిగాని మనము ముందడుగు వేయకూడదు. అదీగాక సముచిత దృష్టి లేనియెడల అది కేవలం అంధ కర్మగా మాత్రమే మిగిలిపోతుంది. కనుకనే ప్రపంచపు పరిస్థితిని ఎప్పుడూ ఒకకంట కనిపెడుతూ ఉండవలెను. నేటి ప్రపంచ పరిస్థితి కల్లోలితంగా ఉన్నది. మనం చూస్తూఉన్నాము. అది స్ఫోటకం మాదిరిగా పొడకడుతున్నది. అంటే ఏ క్షణాన ఏం కీడు మూడుతుందో అని అడుగడుగునా దిగులే. కుతకుత

ఉడుకుతున్నట్టుగాఉంది. ఎప్పుడు అది అగ్నిపర్వతంవలె బ్రద్ద లవుతుందో చెప్పలేము. ఇది నా అభూత ఊహాచిత్రణ కాదు. అయినా అందువల్ల నేను భయవిహ్వలుణ్ణి కావటంలేదు. మీలో భయభీతులు కలిగించడంకూడా నా అభిమతం కాదు. వాస్తవ పరిస్థితుల వైపుకు మీ దృష్టిని మరలించుటమాత్రమే నా అభిమతం. ఇంతకుముందే చెప్పినట్టు ఎప్పుడు ఏంవస్తుందో ఎరుగలేము. నేటి జగత్తులో ఎటుచూచినా అస్థిరమనఃప్రవృత్తి, కల్లోల పరిస్థితులు కనిపిస్తున్నవి.

ఒకటి రెండు మాసాలకు పూర్వం ఢిల్లీలో కొందరు విజ్ఞానులు విద్వద్ధనులు సమావేశమయి "అహింసా" విధానమును గురించి మనన విమర్శలు చేశారు. వారు ఆలోచించిన అంశాలనుగురించి పత్రికలు రోజుకు రోజు ప్రకటిస్తూఉండినవి. మనమంతా వాటినిచదువుకొన్నాం అందులోపూజ్యులురాజేంద్ర ప్రసాదుగారు "ప్రపంచంలోని ఏ దేశంకూడా సైన్యం అవసరం లేకుండా పనులు నిర్వహించుటకు ధైర్యంచేయడం లేద"ని అన్నారు. ప్రత్యక్షంగా గాంధీజీ చేసిన ఉద్బోధలను తమ చెవులతో విని ఆయన సాహచర్య సద్భాగ్యంపొందిన భారత దేశమయినా అట్టి చొరవ చేయలేకుండా ఉందనికూడా శ్రీ రాజెన్ బాబు అన్నారు. మన మహానాయకుడు పండిత నెహ్రూకూడా ఏ ప్రపంచసమస్య అయినాగాని శస్త్రబల ముతో పరిష్కరింప బడజాలదని అనేకసార్లు అన్నారు. మన దేశానికి నేతృత్వం వహిస్తున్న వీరు అహింసా సిద్ధాంతాన్ని మనసారా విశ్వసిస్తారు. హింసావాదంమీద వారికి విశ్వాసం లేదు. అయినా సైన్యాన్ని నిరాకరించేసి దానిని బలీయంగా

వృద్ధిపొందించ వలసిన బాధ్యతను అంగీకరించవలసి వస్తున్నది. మనం ఇటువంటి విచిత్ర పరిస్థితులలో ఉన్నాము.

### బుద్ధి, హృదయానికిగల తారతమ్యం

ఒక వస్తువుమీద మనసు లగ్నమై ఉంటుంది. కాని చేయవలసివచ్చే పనిమాత్రం మరొకటి అవుతుంది. ప్రపంచమంతటా భారతదేశంలోనూ అహింసా విధానం ఆచరణలోకి రావాలని మనసు కోరుతుంది. ఒకరికొకరం భయపడకుండా పరస్పరం ప్రేమతో మనసులను గెలుచుకొనవలెను. ప్రేమమాత్రమే విజయవంతం కాగలదు. ఈ విశ్వాసం మనలో ఉంది. అదిగాక మనలో మరొకటికూడా ఉంది. దానికి 'బుద్ధి' అని పేరు. బుద్ధి ఒక విధంగా హృదయంలోని ఒక భాగమే అయినా హృదయంకూడా అందులోని ఒకభాగం అని గ్రహించవలెను. అవి రెండు పరస్పరం అన్యోన్య సంబంధం గలవి. హింసతో ఏసమస్య కూడా పరిష్కారంకాదని హృదయము అంటూ ఉంటుంది. ఒక సమస్య పరిష్కారం అవుతున్నట్లు అగుపడితే అందులోనుండి అనేక అదనపు సమస్యలు ఆవిర్భవిస్తవి. కొంత ఆలోచన దార్శనికత్వము అదార్శనికత్వము ఈ మూడు గుణాలచే సమ్మిళితమై ఉండే బుద్ధి సైన్యాన్ని తీసివేయడానికి వీలులేదని అంటుంది. మనం ఏ ప్రజాసామాన్యానికి ప్రాతినిధ్యం వహిస్తున్నామో ఆ ప్రజాసామాన్యంలో అందుకు తగినయోగ్యత అవసరమయినంత శక్తి ఇంకా కలుగలేదు. కాబట్టి వారి ప్రాతినిధ్యపు బాధ్యతలను పురస్కరించుకొని సైన్యాలను నిర్మాణంచేసి వాటిని వృద్ధి

తీసుకరావలసిన అవసరం కలుగుతున్నది. పరిస్థితి ఇట్లా ఉంది. నిర్మాణకార్యాలు చేయాలని మనసులో కోరిక కలుగుతుంది. కాని బుద్ధి సైన్యనిర్మాణానికి ప్రేరేపిస్తున్నది. చరఖాపై భక్తిశ్రద్ధలు లేనివారి ప్రసక్తి నేను ఎత్తుకోను. ఎవరికి విశ్వాసముఉందో వారి ఎదుటకూడా ఒక ప్రశ్న వస్తుంది. అది చరఖాద్వారా గ్రామీణ పరిశ్రమలద్వారా యుద్ధ యంత్ర సామగ్రి తయారు చేయగలరా అన్న ప్రశ్న వారి బుద్ధి— మన బుద్ధి— ఎందుకంటే వారిలో మనంకూడాకలసే ఉన్నాము— ఉండవు అని సమాధానం చెపుతుంది. ఈ చిన్న చిన్న పరిశ్రమలతో యుద్ధ యంత్రాలను తయారుచేయు గలగడం అసంభవం. కమ్యూనిటీప్రాజెక్టులగురించి తత్సంబంధకార్యక్రమాలు 5 లక్షల గ్రామాలలో కొనసాగవలెనని ప్రభుత్వం కోరిక. అవి ఇప్పుడిప్పుడు కొన్ని గ్రామాలలో ప్రారంభం అయినవి. అవి దేశమంతటా వ్యాప్తమయి దేశ సుభిక్ష సుసంపన్నంకావాలనీ, దేశంనుండి పేదరిక నిర్మూల కావాలని ప్రభుత్వం వాంఛిస్తున్నది. కాని రేపేగనుక మహా సంగ్రామము ఆరంభమవుతే ఒక్క కమ్యూనిటీప్రాజక్టుకూడా జారీ ఉండదు. ఈ ప్రణాళికను వేసినవారుకూడా అవి జారీ ఉండగలవని నిష్కర్షగా చెప్పజాలరు. వెంటనే బుద్ధిబలశాలి అవుతుంది. హృదయం చాటుకు మణగిపోతుంది. హృదయాన్ని బుద్ధి లోబరచుకొని ఇప్పుడు దేశరక్షణనే ముఖ్యవిషయం అని ప్రబోధించడం ప్రారంభిస్తుంది. ఇది నేను ఆత్మ పరిశీలన దృష్ట్యా చెపుతున్నాను. బాధ్యతగల స్థానాలలో కూర్చొని ఉన్నవారిచోట మనమేగనక ఉండిఉంటే. ఇపుడువారుచేస్తున్న

చేతలకు ఎంతోవరకు విభిన్నంగా చేసి ఉందును అని అనడానికి ఆస్కారంలేదు. ఆస్థానమే అటువంటిది. అది ఇంద్రజాల స్థానం ఆస్థానంలో ఎవరు కూర్చుంటే వారిపై ఒక సంకుచిత నిర్ణిత పరాధీన పరిధిలో ఆలోచించవలసిన బాధ్యతపడుతుంది ప్రపంచ సరళి ఎటువైపు మొగ్గు చూపుతున్నట్టు అగుపడుతుందో అటువైపే నిస్సహాయంగా నేను పైన పేర్కొన్న పరాధీన పరిధిలో ఆలోచనను సాగించవలసిన అవసరం ఏర్పడుతుంది. అమెరికా రష్యాలాంటి అగ్రరాజ్యాలుకూడా భయపడుతవి. పరస్పరం భయాంకలిగి మెలగుతూ ఉంటవి. తక్కువబలంగల పాకిస్తాన్ హిందూస్తాన్‌లాంటి చిన్నరాజ్యాలుకూడా అట్లే భయపడుతవి. ఇట్లా ఒకరికొకరు భయపడుతూ ఉండగా శస్త్రబలంతోనూ సైన్యబలంతోనూ ఏసమస్యా పరిష్కారంకాదు. ఇట్టి విశ్వాసంపైననే మనం శస్త్రబలంపైన సైన్యబలంపైన ఆధారపడుతున్నాము. ఆ ఆధారాన్ని విడిచి పెట్టలేము. ఇటువంటి విచిత్ర పరిస్థితులలో మనం చిక్కుకొని ఉన్నాము. మన నెవరైనా డాంబికులనీ కుతంత్రులనీ అంటే వారికట్లా అనడానికి అధికారంఉంది. కాని వారి అభిప్రాయం నిజమైనదిగా నిరూపితంకాదు. "మనసులోగల మాట ఒకటి పైకి పలికే పలుకదొకటి" అయితే అప్పుడు కుతంత్రుల మవుతాం. కాని మనసు ఒక మాటను అంగీకరించినా పరిస్థితి జనిత బుద్ధి మరొక్క మాట అంటుంది. ఇటువంటి నిర్బంధ పరిస్థితులలో ఏదైనమాట అంటే అది కుతంత్రంకానేరదు. దయకలుగవలసిన పరిస్థితి అది. ఇట్టిజాలికర పరిస్థితిలో ఉన్నాము మనం.

సర్వోదయ సమాజందాని మౌలిక సిద్ధాంతాలమీద నిర్మాణం కాగలదని ప్రజలకు విశ్వాసమున్నది కనుకదానిని ఆచరణా త్మకంచేసి దానికి అనుకూలవాతావరణాన్ని సృష్టించవలసిన అవసరం ఉందని బాబూజీ (రాజేంద్రప్రసాదు) సూచించారు. "సర్వోదయ సమాజం" మీద ఈ బాధ్యతఉంది. సర్వోదయ సమాజం దీన్ని గనుక సాధించ గలిగితే మనజాతీయ ప్రభుత్వానికి అది చేయగలిగిన సర్వోత్తమ సహకారం కాగలదు మనలో ఎవరో ఒకరు మంత్రియై పోతారనుకోండి. మంత్రి అయి మంత్రాంగాన్ని నిర్వహిస్తూఉంటాడు. సైనికాధికారాలు లేకుండా అతడు ప్రభుత్వానికి నేడు చేయగలుగుతున్న సహకారం అప్పుడు మంత్రాంగం తంత్రాంగాల వల్ల చేయడం సాధ్యంకాదు.

## స్వతంత్ర ప్రజాశక్తి నిర్మాణము

ఒకొకప్పుడు ప్రజలు నన్నడుగుతూ ఉంటారు. మీరు ప్రభుత్వ బాధ్యతను స్వీకరించరెందుకు? అధికారాంగంలోకి రారెందుకు? అని. వారికి నేను చెప్పుతూఉంటాను. "ఒకబండికి రెండెద్దులు ఉండనే ఉన్నవి. నేను మూడోఎద్దునైతే బండి కేమిలాభం?" నేను ఆ బండి నడిచేదారిని బాగుపరచి అది సాఫీగా సాగిపోయేటట్లు చేయగలిగితే బండికి ఎంతో ఎక్కువమేలు చేకూర్చినవాడి నవుతాను ఒకటిమాత్రం నిజం ఆ రెండిటితోపాటు నేనుకూడా బసవన్ననే అయితే ఆస్థానాన్ని చేరుకోవలసిందే. నేను కొంచెం కటువైన పరిభాషను ప్రయోగిస్తున్నాను. దాన్ని మీరు సహించగలరని ఆశిస్తున్నాను. మన సంస్కృతిలో నందికిగలస్థానము మానవునికి

గూడా లేదు. అదృష్ట్యాసే నేనీ పదాన్ని ప్రయోగించినాను. రాజ్యముయొక్క ధుర (భారము)ను వహించువానిని మనము “ధురంధరుడు” అని అంటాము. ఎద్దుకూడా భారమును వహిస్తుంది కదా! అదిగో అట్టి “ధురంధరుల”ము కావలసి వస్తుంది మనము. కొందరు ఆ “ధురంధర” స్థానమును చేరుకొన్న పిదప తాము చేస్తున్నపని ఇతరులెవరైనాచేస్తే ఆక్షేపిస్తారు. “మేము చేస్తున్నపనులలో దొసగులూ లోపములుగా మేము అనుకొంటున్నవాటినిమాత్రమే మీరుసర్దుబాటు చేయగలిగితే చేయండి” అని వారు తెలవిస్తారు. ఇటువంటి ఆశతో నే వారు మనవంక చూస్తున్నారు. ఇది మనము బాగుగా అర్థం చేసుకొనవలెను. దేనినయితే నేను ‘స్వతంత్ర ప్రజాశక్తి’ అంటానో తన్నిర్మాణకృషిలో నే మనం తన్మయులం కావలెను. అప్పుడే నేటిప్రభుత్వానికి మనం నిజమైన సహాయము చేయగలుగుతాము. మన దేశానికి సముచిత సేవ చేయగలుగుతాం. స్వతంత్ర ప్రజాశక్తిని నిర్మాణము చేయవలెనని అన్నాను. అంటే హింసాత్మకశక్తికి విరోధమైనదిగానూ దండనశక్తికి విభిన్నమైనదిగానూ ఇట్టి ప్రజాశెల్లువ ప్రకటితం చేయవలెనని నాభావం. నేడుఅధికారములోఉన్న ప్రభుత్వానికి దండనశక్తిని దత్తంచేసినాము. ఆ దండనశక్తిలో ఒక మూల హింసాంశం నిబిడీకృతమయి ఉన్నది నిస్సంశయమే; కాని అది ప్రజలందరిచే సాముదాయికముగా దత్తం చేయబడింది. కనుక దాన్ని వేరువర్గంలో ఉంచగోరుతాం. అది కేవలం హింసాత్మక శక్తి కాదు. అది దండనశక్తిమాత్రమే. అట్టి దండనశక్తి కూడా ప్రయోగించే అవసరం కలుగనట్టి వాతావరణమును

సృష్టించుటకు మనం కృషిచేయవలసి ఉన్నది. మనము ఆ పని చేయగలిగితే స్వధర్మమును గుర్తించి తదనుసారముగా నడుచుకొన్నామని చెప్పవచ్చును. అట్లాకాక దండనశక్తి యొక్క ఉపయోగముతో సాధ్యంకాగల జనసేవ పైననే విశ్వాసం పెట్టుకొని కూర్చున్నట్లయితే మనచేత ఏ విశిష్ట కార్య నిర్వహణము ఆశింపబడుతున్నదో అదిమాత్రం మనవల్ల సాధ్యం కాకుండాపోతుంది. మనం కేవలం బహురూపుల వారముగా నిరూపితమగుటకూడా జరుగవచ్చును.

## మనము చేయవలసినపని

ఇంకా కొంచెము స్పష్టముగా తెలుపుతాను. దండన శక్తి యొక్క ప్రయోగమువల్లకూడా సేవాకార్యములు జరుగుతవనీ అందుకే ప్రభుత్వశాసనమును కోరినామని నేను ఇంతకుముందే అన్నాను. ఎప్పటివరకు సమాజంకోసం అది అవసరమయి ఉంటుందో, అప్పటివరకు ప్రభుత్వంపైగల శాసన బాధ్యతను కాదనలేము. ఉదాహరణకు, యుద్ధం జరుగుతున్నదనుకోండి. యుద్ధములో ఎందరో సైనికులు గాయపడుతుంటారు. వారి గాయాలను నయంచేయుటకు తదేకంగా సేవచేస్తున్న వారిహృదయాలు భూతదయతో పరిపూర్ణమయి ఉంటవి. శత్రువులెవరు, మిత్రులెవరు అని వారు చూడరు. తమ ప్రాణాలను అరచేత బట్టుకొని వారు యుద్ధభూమి ప్రవేశిస్తారు. యుద్ధరంగంలో వారుచేసే సేవ తల్లి తన పిల్లలకు చేసే సేవతో సమానమైనట్టిది. వారెంతో దయాళువులుగా ఉంటారు. అందుకేమాత్రం సందేహములేదు. వారు చేసే సేవ అమూ

ల్యమైనది. అది అందరికీ తెలుసు. కాని యుద్ధాన్ని నిరోధిం చడం వారిచేతకాదు. ఆ పని వారు చేయజాలరు. యుద్ధానికి మాన్యతనిచ్చే సమాజంలో వారి దయకూడా ఒక భాగమే. ఒక యంత్రంలో చిన్నవి పెద్దవి అనేక చక్రాలు ఉంటవి. అవి పరస్పరం విభిన్న దిశలలో తిరుగుతున్న వయినా అవి అన్నీ ఒకే ఒక యంత్రానికి చెందిన చక్రాలు. అట్లే యుద్ధ యంత్రానికిగూడా రెండు వేర్వేరు అంగాలు ఉన్నవి. ఒకటి ప్రాణాలను బలిగొంటుంది. రెండవది గాయపడినవారికి కట్లు గట్టి వారు ఆరోగ్యవంతులయ్యేవరకు శుశ్రూష చేస్తుంది. ఆ రెండు అంగాలు చేసే పనులుపరస్పరం విరుద్ధముగాఉన్నవి. ఒకటి క్రూర కార్యమయితే రెండవది కరుణామయము. ఆ కరుణామయ హృదయముయొక్క కరుణ, ఆ క్రూర హృదయముయొక్క క్రౌర్యము, ఇవి రెండు కలిస్తేనే యుద్ధమవుతుంది. ఈ రెండు విభాగాలు గూడా యుద్ధమును సాగించేవే. కొంచెం కటువుగా చెప్పాలంటే మనం యుద్ధమును అంగీకరిస్తున్నంతసేపూ, సైనికునివృత్తి స్వీకరించినా లేక సైనికసేవావృత్తి స్వీకరించినా యుద్ధంలో జరుగు మారణహోమానికి బాధ్యులము కావలసిందే. దయా మయ హృదయంతో పనులుచేసినంత మాత్రాన సదయ రాజ్యము ఏర్పడుతుందని అనుకోకూడదు. అసలు రాజ్య నిర్వ హణమే నిష్ఠురత్వంతో కూడుకొనిఉన్నపని అని తెలుపుటకే నేను పై దృష్టాంతము పేర్కొన్నాను. రొట్టెలో ఉప్పు ఎట్టి రుచిని కలిగిస్తుందో నిష్ఠురత్వంలో దయ అట్టి పాత్రను నిర్వహిస్తుంది. గాయపడిన సైనికుల సేవ ఆ యుద్ధరంగంలో

ఒక మంచి పరిమళాన్ని వెదజల్లుతుంది. అంతేకాని ఆ సేవతో భయంకరయుద్ధం పరిసమాప్తి పొందదు. ఈవిధంగా "దయా మయ కార్యము"లను మనం చేసి అందువల్ల నిష్ఠుర రాజ్యములో దయ ప్రజల పాలబడి నిర్దాక్షిణ్యపు ప్రభుత్వములో దయ ఏర్పడిన ఎడల మనము మన కర్తవ్యమును మనము నిర్వహించినామని చెప్పలేముకదా! పైకి దయామయముగా అగుపడే కార్యములు, నిర్మాణాత్మకముగా అగుపడే పనులు వ్యాపకదృక్పథము లేకుండా వాటిఫలితము దృష్ట్యానే చేయుట ద్వారా మనచే కొంత సేవ జరుగుతుంది. కాని మనపైగల బాధ్యతను, సర్వత్రా అంగీకరించబడిన స్వధర్మమును పాలించినవారము మాత్రము కాము. వేరొక స్పష్టమైన ఉదాహరణమును పేర్కొంటాను.

## ప్రేమపై విశ్వాసము

"ప్రభుత్వంపైన మీరుపలుకుబడి ఉన్నదికదా! అయితే ప్రభుత్వమేకాసనంద్వారా వినా నష్టపరిహారం భూమి విభజన చేసేమార్గము నెందుకుచూడరు?" అని తరుచు ప్రతివారు నన్ను అడుగుతూవుంటారు. భాయీ! శాసనమార్గాన్ని నేను అవరోధించుట లేదుకదా! నేను అనుసరిస్తున్న మార్గంలో నూటికి నూరుపాళ్ళు విజయం సంప్రాప్తం కాకపోతే కనీసం శాసనానికైతే సౌలభ్యం ఏర్పడుతుదికదా! ఒకటి నేను శాసనానికి ప్రతిబంధకాలు కల్పించుటలేదు. రెండవది, శాసనానికి సౌలభ్యమునే చేకూరుస్తున్నాను. అందుకు అనుకూల వాతావరణమును సృష్టిస్తున్నాను. శాసనమునకు అనువుగా

సుముఖపరిస్థితులు కల్పించినఎడల ఆ పని సులభసాధ్యమవుతుంది. మీ బాటలో ఒక అడుగు ముందుకువేసి శాసనం తయారు కావాలె కావాలని అరుస్తూ కూర్చుంటే నేను కేవలము స్వధర్మవిహీనునిగా నిరూపితుడ నవుతాను. అదినాధర్మముకాదు. శాసనమేమైనాసరే ప్రజాహృదయములో భూమి విభజన భావాలు సుస్థిరముగా నిర్మాణమగుటకు కృషిచేయుట నా ధర్మం. తల్లి తన పిల్లకు పాలిచ్చుటకు ఏ శాసనమును పాటిస్తున్నది? మానవజీవితమును సమృద్ధము చేయగల గొప్ప శక్తి మనిషి హృదయములో ఉంది. మానవుడు ప్రేమపై విశ్వాసముకలిగిఉంటాడు, ప్రేమనుండిజన్మించినాడు. ప్రేమతో పరిపోషితుడవుతాడు, కడకుప్రపంచమునువదలి వెళ్ళేటప్పుడు కూడా ప్రేమతో పరిసరాలను పరికిస్తాడు. తనకు ప్రియతములైనవారు అంతిమ దర్శనముకోసము వస్తే మితిలేనిప్రేమతో వారిని తనివిదీరాచూసి మూయలేక, మూయలేక కన్నులు మూస్తాను. ఈ విధంగా నిత్యము మనము ప్రేమానుభూతిని పొందుతూ, ప్రేమకుగల ఆమోఘశక్తిచే ప్రభావితులమవుతూ ఆ ప్రేమనే విస్తృతపరచి సామాజిక స్వరూపములో వికసితము చేయకుండా 'శాసనమో శాసనమ'ని పలవరిస్తూ ఉన్నందువల్లజనశక్తిని నిర్మాణముచేసి ప్రభుత్వము ఆశిస్తున్న సహాయమును చేయలేకుండాపోతాం. అందుకే దండనశక్తికి భిన్నముగా మనమంతా జనశక్తినినిర్మాణముచేయువలెను. ఏజనశక్తి నిర్మాణమును మనము తలపెడుతున్నామో అది దండనశక్తికివిరోధి అని నేననను, అదిహింసకు విరోధిఅని మాత్రము అంటాను. ఇంతకుముందేఅన్నట్లు అదిదండనశక్తికి భిన్నముగాఉంటుంది.

## కార్య విధానము

మరొక దృష్టాంతము. ఇప్పుడే ఖాదీ సమితి ఏర్పడు తున్నది. ప్రభుత్వము దానికి సహాయముచేయ సంకల్పించింది. 'నాలుగేండ్లకు పూర్వము జరుగవలసినపని ఇంత ఆలస్యముగా ఎందుకు జరుగుతున్నదో మరి నాకు ఆశ్చర్యము వేస్తున్నది' అని పండిత నెహ్రూ అన్నారు. వారు గొప్పవారు, వారిహృదయము గొప్పది. వారు ఆత్మ పరీక్ష చేసుకొంటారు. ఇటువంటి భాషలో మాట్లాడుతారు. ఇక మన పని, చరఖా సంఘము చేయవలసినపని ఏమిటంటే ప్రభుత్వము ఖాదీసమితి కార్యకలాపాలకు స్ఫూర్తి నివ్వడముద్వారా ఖాదీ ఉత్పత్తిని పెంచదలచుకొన్నది కనుక దానికి కొంత సహాయము చేయవలెను. చరఖాసంఘానికి ఈ పనిలో అనుభవమున్నది. ఈ పనికి అనుభవయోగ్యులైన వారి సహకారము ఎంతైనా అవసరము. అయినా ఒక పౌరునిగా, ఒక నిపుణునిగా ఆలోచిస్తే ప్రభుత్వానికి చేయగల సహాయముచేయుట అవసరమని తోస్తుంది. కాని అందులోనే నామరూప రహితముగా మ్రగ్గిపోవడముద్వారా ఖాదీకి చేయవలసినసేవ చేయలేము. ఖాదీనిగురించిన మన దృక్పథముఎప్పుడూవిస్పష్టమైనదిగనూ, విశుద్ధమైనదిగనూ ఉండవలెను. అట్టి పరిశుద్ధ దృక్పథములోనే ఖాదీ ఉత్పత్తిని పెంపొందించుట ద్వారా శక్తివంచన లేకుండా ప్రభుత్వానికి సాయపడవలెను. యుద్ధాన్ని రూపుమాపే ఉపాయాలను మనము కనుగొనవలెను. అక్కడికి యుద్ధాలు చెలరేగుతూనే ఉంటే గాయ

వడే సైనికులకు కట్టుగట్టడమైనా చేయవలెను. ఇది యుద్ధానికి ఒక భాగమే అని అలక్ష్యంచేయుట తగదు. కేవలము అదే మనము చేయవలసిన పని, అనికూడా అనుకోకూడదు. గ్రామ రాజ్య సంస్థాపనకోసం మనము ఖాదీపని చేయగలుగుతాం.

ఈసారి పండిత నెహ్రూ నన్ను కలుసుకోవడానికి వచ్చి ఉండిరి. ఎంతో ఆప్యాయంగా ప్రేమతో మాట్లాడినారు. వారు చెప్పినదంతా నమ్రతతో విన్నాను. సలహాలను గురించి అడిగి నారు. నాకు తోచినంతమట్టుకు నా అభిప్రాయాలను ప్రక టించినాను. అక్షరాస్యత నాగరకతకు లక్షణము. ప్రభుత్వం గ్రామీణులందరినీ నాగరికులనుచేయుటకు వారికి విద్యగరిపే బాధ్యతనుస్వీకరిస్తుంది. అట్లే ప్రతి గ్రామీణుడు కూడా నూలు వడకుటతప్పనిసరియని ప్రభుత్వము భావించవలెను. నూలువడ కుటకూడా అక్షరాస్యతవలె నాగరకతకు లక్షణమని అంగీకరించ బడవలెను. నిరక్షరకుక్షులు నాగరీకులు కారని ఎట్లా భావించబడు తుందో అట్లే నూలువడకని గ్రామీణులు అనాగరీకులని భావించబడవలెను. ప్రభుత్వము ఈ సూచనను ఆమోదించి నట్లవుతే మా ఆధికారిక సహాయము లభించగలదు. ప్రభుత్వము ఈ ఆలోచనను అంగీకరించిన పక్షములో మేము ఆర్థిక సహా యమును కోరేదిలేదు. నా ఈ మాటలను, వారువిన్నారు. వారి హృదయానికి కూడా ఈ మాటలునచ్చినవనే అనుకుం టాను. "సరే గ్రామీణులందరికీ నూలువడకుట నేర్పుతా మనుకోండి, కాని అందువల్లకలిగే ప్రయోజనమేమిటి?" అనివారు తమసహజ చమత్కార ధోరణిలో ప్రశ్నించారు. అందుకునే

నిట్లన్నాను. చదువుట వ్రాయుట నేర్పినమీదటగూడా ఈ ప్రశ్న వస్తుందికదా! అక్షరాస్యతవల్ల కలుగు ప్రయోజనమేమిటి? అన్నప్రశ్నకుకూడా ఆస్కారము లేకపోలేదు. రెండుమూడు సంవత్సరాల వరకు ఏదో కొంత విద్యనభ్యసించిన వారెంద రినో నేనుచూచినాను. అట్టివారికి ఆవిద్యవల్ల జీవితములో ఏ మాత్రము ఉపయోగములేకపోయింది. వారికి నల్లనిఅక్షరము, ఒకగేదె రెండూసమానమే. 'యోగము'తో పాటు 'క్షేమం' కూడాకలిసేఉంటుంది. దీనినివిస్మరించడంకూడదు. నేనుఖాదీని గురించి కోరినకోరిక కొద్దిమాత్రమేనని మీరనుకొని ఉంటారు ఇది ప్రజాప్రభుత్వము అయినప్పుడు ప్రజల స్వల్ప వాంఛలను ఈడేర్చ వలసిన బాధ్యత ప్రభుత్వముమీద ఉంటుంది. కేవలం గ్రామీణులేఖాదీపరిశ్రమపట్ల శ్రద్ధవహించవలెనా, నూలువడ కుటను గ్రామసీమలవరకే పరిమితంచేయుట ఎందుకుఅనిమీరు అడుగవచ్చు. అధికసంఖ్యాకుల పైన శాసనంద్వారా ఈ ఒత్తి డిచేయువలెనని కోరినఎడల నాపనినినేను సరిగా అర్థముచేసుకో లేదని అనుకోవలసి ఉంటుంది. ఖాదీని ఈ విధముగా ఒత్తిడి ద్వారా ప్రచారముచేయుటకాదు నేనుకోరుతున్నది. మనము నిర్మాణము చేయువలసినది 'జనశక్తి' గాని 'దండనశక్తి' కాదని ఇతఃపూర్వమే చెప్పియుంటినికదా! అట్లయినచో నేనీసూత్ర మును విస్మరించినట్లు కాగలదు. రెండువాస్తవిక దృష్టాంతము లను పేర్కొన్నాను. ఒకటి, ఖాదీని గురించినది, రెండవది, భూమిదానమునుగురించినది. మనం భూమిసమస్యను పరిష్కరిం చుటకు బయల్దేరితే మనకార్యవిధానము ఒకతీరుగ ఉంటుంది. ప్రజాస్వామిక ప్రభుత్వము భూమి సమస్యను పరిష్కరించు

నపుడు దండనశక్తిని ఉపయోగిస్తుంది. అందువల్ల ప్రభుత్వానికి దోషము అంటదు. అంతేకాక, అదిమరొకమార్గం అవుతుంది. కాని, ఆమార్గంలో జనశక్తినిర్మాణం సాధ్యం కాదు. బహుశా 'ధనలక్ష్మి' సమకూరితే సమకూరవచ్చు. మన ఉద్దేశం అదికాదు. ప్రజాబలాన్ని క్రోడీకరించుటయే మనకర్తవ్యం. ఈ దృష్టితో మనపని కొనసాగవలసి ఉన్నది.

సంక్షేపంగా ముగింపదలచి ఉంటిని, కాని వివరణ విస్తారమైపోయింది. ఈ దృక్పథము మనలో స్థిరపడిపోయిన పిదప కార్యవిధాన మేరీతిగ ఉండవలెనో అంతగా వివరించి తెలుపవలసిన అవసరము ఉండబోదు. దండనపద్ధతి అవసరము కలుగకుండునట్లు నిర్మాణాత్మక కార్యకలాపాలద్వారా ప్రజా బలాలను క్రోడీకరించవలసిన అవసరము ప్రతివారు గమనిస్తారు. ప్రజలే ఐచ్ఛికముగా సర్వం నిర్వహించుకొనగలుగు నట్టి దశ అంతిమఆశయం కావలెనని అందరూ వాంఛిస్తారు.

## రెండు ముఖ్యాంశాలు

ఈ దృష్టితో ఆలోచిస్తే కార్యవిధానానికి రెండు ముఖ్యాంశాలున్నవని మనకు తెలుస్తుంది. ఒకటి భావుకతను శాసనము, రెండవది 'కర్తృత్వ విభజన.' నాకు కొంచెము శాస్త్రీయ పదజాలమును సృష్టించే లపాటు సంస్కృతము తెలిసినవాణ్ణి. కనుక ఎక్కువగా సంస్కృతపదాలే దొరలుతుంటవి. అందుకు మీరు నన్ను క్షమించగలరని ఆశిస్తాను.

## భావుక అను శాసనము

భావుక అను శాసనమంటే ఆలోచనలను అర్థమయ్యే రీతిగా నచ్చ జెప్పడము. మనము చెప్పేవాటిని ఎవరైనా అర్థము చేసుకోనకుండా గ్రుడ్డిగా ఒప్పకొంటున్నట్లయితే అందుకు మనము సంతోషించకూడదు. దుఃఖించ వలసిన విషయమది. ఒకరిమీద మన భావాలను రుద్దకూడదు. మన దృక్పథము వారికి స్పష్టముగా అర్థమయ్యేటట్లు చెప్పడము మట్టుకే మన విధి. అంతటితోనే సంతుష్టి జెందుట సముచితము. సర్వోదయ సమాజప్రణాళికను కొందరు 'లూజ్ ఆర్గనైజేషన్' పేలవమయిన వ్యవస్థ అని అన్నారు. నిర్మాణ వ్యవస్థ పేలవంగానూ లుక లుక లాడుతూవుంటే మనమేపనికూడా చేయలేము. అసలు ప్రణాళికయే లేకుంటే అది నిష్క్రియత్వముక్రిందకు వస్తుంది. అప్పుడు కేవలం ఆలోచనల ఆధారము మీద నిలువబడుటకు ప్రయత్నము చేయడమే అవుతుంది. అందుకని మన నిర్మాణము ఉన్నత భావసౌష్ఠవం కలదిగా మాత్రమేగాక పటుతరముగాకూడాఉండవలెను. ఒకరిని మనం ఆదేశించేదిలేదు. అందువల్ల ఎవరైనా మన మాటలను అంధముగా అనుకరించే ప్రమాదమూలేదు. ఒకరి చెప్పుచేతలలో మెలగేదిలేదు. అందువల్ల ఎవరైనా చెప్పినట్లుగా నడుచుకోవలెనన్న నిర్బంధమూలేదు. పరస్పరము సంప్రదించుకొంటాము. తర్వాత ఏదైనా ఒక నిర్ణయానికి వస్తాం. కురాన్‌లో భక్తుల లక్షణములను గురించి వ్రాసిఉంది. "ఏపని చేయుటకైనా వారుఅంతా ఒకరితో ఒకరు సంప్రదించు కొందురు.

అట్టివారు మాత్రమే భగవద్భక్తు లవదగుదురు" అని అందులో స్పష్టముగా ఉల్లేఖింప బడిఉంది. అందుకని మేము ఎవరితో నైనా సంప్రదిస్తాం. అంతే. ఎదుటివారు మా మాటలను అంగీకార యోగ్యములుగా లేదని త్రోసివేసినాకూడ మేము చాలా సంతోషిస్తాము. అర్థం చేసుకొనక గుడ్డిగా ఆచరణ ప్రారంభించడం చూస్తే దుఃఖము కలుగుతుంది. ఈ ప్రణాళికలో ఎంతపాటవం ఉందో ఇంకే ఉత్తమ ప్రణాళికలోనూ, సుస్పష్ట ప్రణాళికలోనూ. శాసనసంబద్ధ ప్రణాళికలోనూ అంతపాటవం లేదు. అంతే శాసనసంబద్ధమూ దండభయయుక్తము అయిన ప్రణాళిక శక్తియుతమైనది కాదని నేననడంలేదు. కాని మనము ఉద్దీపింప జేయవలసిన శక్తి వేరు. అది శివశక్తి. శాసన పూర్వకముగా తీసుకరాబడునది నా దృష్టిలో శక్తి కానేరదు. అందుకే మేము భావపూర అనుశాసన అవసరమును అంగీకరించుటకు అభిలషిస్తున్నాము ఇది గుర్తిస్తే నిరంతర భావ ప్రచారము మనకొక కార్యక్రమ మవుతుంది. ఇప్పుడు భావప్రచార కార్యక్రమమును మనము నిర్వహించుటలేదు అది జరుగవలసి ఉన్నది.

ఈ దృక్పథంతో నేను ఆలోచిస్తూఉంటే, బుద్ధ భగవానుడు 'భిక్షుక సంఘము'లను, శంకరాచార్యులవారు " యతి సంఘము " లను ఎందుకు ఏర్పరచిరో, ఆ రహస్యమేమిటో నాకు స్పష్టముగా బోధపడుతుంది. అయినప్పటికీ ఆ సంఘాల అనుభవాలు వాటి గుణ-దోషములను చూచి, అట్టి సంఘములగొడవలలో పడకుండా ఉండడమే ఉత్తమమన్న అభిప్రాయానికి వచ్చినాను. ఎందుకంటే

వాటిలో సద్గుణములకన్నా దోషములే అధికంగా అగుపిస్తవి. కనుక మేము సంఘమునుఏర్పరచము. కాని వారు సంఘములనెందుకు నిర్మాణము చేయవలసి వచ్చింది? అన్న ఆలోచన మాత్రము కలుగుతుంది. ఈ తరహా ప్రవహించే ఝరులవలె సతతమూ ప్రజలకు భావామృతధారను అందించేవారు ఎప్పుడూ తిరుగుతూఉండడం చాలాఅవసరం. అదివినా సర్వోదయసమాజము, కాలు కదపలేదు. ప్రజలవద్దకు చేరుకొనుటకు ఎన్ని అవకాశములు లభ్యంకాగలవో అన్ని అవకాశములను వినియోగించు కొనవలెను. ఒకసారి చెపితే ప్రజలు వినకపోతే రెండవ సారి చెప్పే అవకాశము వస్తుంది. అప్పుడు నిరాశ జెందక పరోక్ష ప్రచారం కాగలదని సంతుష్టి జెందవలెను. సిద్ధాంతాలు, ఆశయాలు, భావ ప్రచారాసక్తి, ఉత్సాహము, శ్రద్ధ, నిష్ఠ. తత్పరత మనలో కలుగవలెను. కాని మనపరిస్థితి ఎట్లా అయిందంటే మనలో అనేకులు అనేక సంస్థలలో చిక్కుకొనియున్నారు. ఈ విషయము తర్వాత కొంచెం చర్చిస్తాము. ఇప్పుడు స్పృశించి వదలివేస్తున్నాను ఒకవేళ అవి మహాసంస్థలయినప్పటికీ మనకుసంస్థపట్ల అంతగా ఆసక్తి ఉండకూడదు. సంస్థపట్ల భక్తి ఉంటే పరవాలేదు. సంస్థపనిని నడుపుతూ ఉండవచ్చు, సంస్థను నిల్పి ఉంచవచ్చు, కాని కొందరు వ్యక్తులు ఎటువంటివారు ఉండవలెనంటే వారు ఎప్పుడూ తిరుగుతూ ఉండవలెను.

ఇట్టి నిర్మాణ వ్యవస్థ, కార్యక్రమము లేనిఎడల మన ఆశయాలు, భావాలు క్షీణించిపోతవి. భావుక అను శాసనము నడువదు. ఇతర అనుశాసనమును మేము ఛలాయించ దలుచు

కోలేదు. చూడండి! భూదానయజ్ఞ కార్యక్రమము బిహార్ కాంగ్రెసు మొట్టమొదటిసారిగా ఆరంభించిందని బిహార్ ప్రజలు అభిమానంతో ప్రకటించుకొంటారు. ఆ తర్వాత హైద్రాబాదులో అఖిలభారత కాంగ్రెసు భూదాన యజ్ఞమునుకొంతవరకు ఆమోదించింది. అయితే ఏమయింది? 'భూదానంలో సహాయము చేయడము ప్రతి కాంగ్రెసు వాది కర్తవ్యము అని పైనుండి ఒక సర్క్యులర్ జారీఅవుతుంది. భాగీరథి, గంగ 'ఆకాశంబుననుండి శంభుని శిరంబందుండి' హిమాలయ గిరినుండి బయల్దేరుతుంది అక్కడినుండి హరిద్వారము చేరుతుంది. అట్లే పైనుండి బయల్దేరినపత్రిక ప్రదేశ సమితికి చేరుతుంది. గంగానది హరిద్వారమునుండి బయల్దేరిన తర్వాత గఢముక్తేశ్వరానికి వెళ్ళుతుంది. ఇక ఆ పత్రమకూడా ప్రదేశ కార్యాలయమునుండి జిల్లా కార్యాలయానికి చేరుతుంది. అక్కడ ఒక్క పత్రానికి అనేకప్రతులు తయారవుతవి. ఎంత దూరంపోయినా గంగ గంగయే. అట్లే ఎన్ని ఆఫీసులుమారినా కాగితము కాగితమే. ఆ కాగితానికి అనేక కాగితాలు పుట్టుతవి. "జాతి స్వజాతినే పుట్టిస్తుందని ఓసారి క్రితమే హాస్యంగా అన్నాను. అట్లే పత్రము పత్రాలనే పుట్టించ గలుగుతుంది. ఇంతకూ పనిచేసేదెవరు? పని చేయవలసినవారు గ్రామీణులే కదా! కాని, గ్రామీణులదాకా ఆపత్రం ఎక్కడచేరుతుందని? అది ఒక కార్యాలయంనుండి రెండవకార్యాలయానికి పోతుంది. అక్కడినుండి మూడవ కార్యాలయానికిపోతుంది. అంతే. అయితే ఈ భూదానయజ్ఞము వంటి కార్యక్రమాలు మనం ఇల్లిల్లూ తిరుగనట్లవుతే సఫలమయ్యేవికావు. 5 లక్షల

గ్రామాలలో మనము 25 లక్షల ఎకరాల భూమి సేకరించ దలచుకొన్నాము. సులభమైన పద్ధతిగా కన్పడుతుంది. గ్రామా నికి 5 ఎకరాలు ఏమంత గొప్ప విషయము కాదు. కాని అన్ని గ్రామాలవరకు చేరుకొనేదెవరు? అందువల్లనే భావప్రచారము ముఖ్యసాధనగా ఉపకరించగలదు. అందుకు అవసరమైన ప్రణా ళికను మనమేర్పాటు చేసుకొనవలెను. ఇది మన కార్యక్రమం కాగలదు. ఈ బృహత్కార్య నిర్వహణకు కావలసిన స్థైర్యం మనలో కలుగకపోతే 'ఇన్ని గ్రామాలు ఎవరు తిరుగుతారు' అని నీరసంవచ్చి ఇంగ్లీషులో 'షార్ట్ కట్' అంటారే అదిగో, అట్టి అడ్డదారి అంటే ఈపని శాసనంద్వారాజరిగితే బాగుండు, అది జరిగితే బాగుండు ఇది జరుగుతేబాగుండు, అని ఈ రక ముగా ఆలోచన పెడదారులను త్రొక్కుతుంది. ఆ అడ్డదారు లనుగురించి ఆలోచనలుచేయుడము మన పని కాదు శాసనము రావలె, తొందరగా రావలెను స్వరూపంలో రావలె. అది సరే. దాన్ని గురించిన ఆలోచన మనమే మొదలుపెడితే మనకు పరధర్మ పాలనదోషం పట్టుకొంటుంది. ఊరూరా పర్యా టనను ప్రారంభించటము సిద్ధాంతాల మీద సంపూర్ణముగా విశ్వాసము పెట్టుకొనడము అది మనస్వధర్మం. 'ఆఁ వినీ విని పించుకొనడముతో జరిగేదేమి లే' అనిఅనుకో కూడదు. భావ ప్రచారమువల్ల ఎంతోపనిఅవుతుంది. అయితే ఈ భావపటిమ భావానుశాసనము మనకొక నవ్రజాయుధమువంటిది.

కర్తృత్వ విభజన

రెండవది కర్తృత్వవిభజన అనగా కర్తృత్వమంతా ఒకే చోట కేంద్రీకృతం కాకూడదు. గ్రామగ్రామంలోనూ కర్మ

శక్తి కర్మసత్తా నిర్మాణం కావలెను. ప్రతిగ్రామానికి స్వయం నిర్ణయాధికారముండవలెను. ఒక ఊళ్ళో గానుగ నడువ వలెనని మెషిన్‌చే తీయబడిన నూనె వారిఊళ్ళోకి రాకూడదని ఆ ఊరివారు కోరుతారనుకోండి. ఆగ్రామంవారికి మెషీన్‌నూనెను బహిష్కరించేటందుకు, ఆ ఊళ్ళోకి అసలు ఆ నూనెను రానీయకుండుటకు సంపూర్ణాధికార ముండవలెను.

ఇట్లాఅంటే, ఒక పెద్దరాజ్యాధికారములో ఇటువంటి చిన్నశాసనాధికారం నడువదు, అని అంటారు. అధికారమును వికేంద్రీకృతం చేసుకపోతే, కర్తృత్వాలను విభజించుకొనక పోతే సైనికశాసనం అనివార్యమవుతుంది. ఇది మీారు బాగా తెలుసుకోవలెను. అప్పుడు సైన్యం లేనిది ఏపనిఅయినా ఏమాత్రం కొనసాగదు. అయితే సైనిక పరిపాలనవద్దు అనడానికి వీలులేదు. కాబట్టి ఇంకెప్పుడు ఇలాంటి ఆలోచన తల పెట్టకండి. ఎప్పుడైనా సైన్యాధికారమునుండి విముక్తినిమీారు కోరుతున్నట్లవుతే పరమేశ్వరుని అనుసరించండి. పరమేశ్వరుడు మనుష్యులందరికీ తెలివిని పంచిఇచ్చినాడు. అంతేకాదు సకలజంతు కోటికీ తెలివి నిచ్చినాడు. తేలు, పాము, పులి, మానవుడు, మొదలగు జీవులన్నీ తెలివిగలిగి మెలగుతూ ఉన్నవి. వాటిలో ఎక్కువ తక్కువలు ఉండవచ్చు. అయినా ఈశ్వరుడు వాటన్నిటికీ కూడ తెలివి నిచ్చి మీామీా జీవనాలకు దీని నాధారంగా పెట్టుకొండని ఆదేశించినాడు. అప్పుడు ప్రపంచమంతా ఎంతో చక్కగా నడువడం ప్రారంభించింది. ఈశ్వరునికి పూర్తివిశ్రాంతి లభిం

చింది, రాగా రాగా అసలు భగవంతుడు ఉన్నాడా లేడా అన్న అనుమానం జీవకోటికి కలుగడం వేస్తూ వచ్చింది. అట్లే అధికారమును, పంచివేయుటద్వారా, వికేంద్రీకృతం చేయుట ద్వారా ఎటువంటి పరిస్థితి ఏర్పడవలెనంటే, అసలు ప్రభుత్వమన్నది ఉన్నదా? అన్నభావం ప్రజలకు కలుగవలెను. భారత దేశంలో రాజ్యాధికారమే లేదేమో! అని అంతా అనుకోవలెను. అప్పుడుగాని మన రాజ్యము అహింసాత్మకముకాదు. ఇందుకే మేము గ్రామ రాజ్యనిర్మాణమును కోరుకున్నాము. ఇందుకే ప్రతి గ్రామానికీ స్వయం నిర్ణయాధికారము ఉండవలెనని మేము కోరుతున్నాము. గ్రామీణులు తమ కాళ్ళమీద తాము స్వయముగా నిలువగలుగుట జనశక్తి నిర్మాణానికి పునాదిరాయి కాగలదు. మా ఊరికి ఫలానావస్తువు, ఫలానా పని కావాలె, ఫలానా ఒద్దు, అని వారు ప్రభుత్వానికి చెప్పివేయ గలుగవలెను. వారు కోరినకోర్కెను ప్రభుత్వము ఆమోదించదనుకోండి. లేక ఆమోదించదలచినాగాని ఆచరించలేని పరిస్థితిలో ఉందనుకోండి. అప్పుడు ఆ గ్రామము ప్రభుత్వానికి ప్రతికూలంగా నిలువగలుగవలెను. అంతధైర్యం ఆ గ్రామవాసులలో ఉండుట అవసరము. గ్రామాలలో అంతటిశక్తి ఉత్పన్నమవుతే అది ప్రభుత్వానికి ఎంతో సహాయకారి అవుతుంది. ఎందుకంటే అందువల్ల సైనికబలము అనవసరము అవుతుంది. రాను రాను విచ్ఛేదమవుతుంది. ఇది వినా సైనికబల విచ్ఛేదము సాధ్యముకాదు. ఢిల్లీలోనే ఒక పెద్ద తలకాయ-చతుర్ముఖుని తలకాయలు నాల్గింటినీ కలిపితే తయారయ్యేటంత పెద్దది-ఉండి, అది దేశము మొత్తములోగల

గ్రామాలన్నిటికి సంబంధించిన వ్యవహారాలను చూసుకోవడము దుస్తరము. అందుకొరకే 'నేషనల్ ప్లానింగ్' జాతీయ నిర్మాణముకాక 'విలేజ ప్లానింగ్' గ్రామనిర్మాణము కావలెను. అసలుజాతీయనిర్మాణమంటేనే గ్రామనిర్మాణం అన్న అర్థము స్ఫురించవలెను. గ్రామ నిర్మాణమునకు చేయవలసిన అవసరమైన సహాయపుపనులు ఢిల్లీలో చేయబడవలెను. అట్లా జరగడం సముచితము. ఇది మన కార్యక్రమములోని రెండవ ముఖ్యాంశము. ఒకటి ఇంతకుముందు వివరించిన భావానుశాసనము, రెండవది కర్తృత్వ విభజన లేక వికేంద్రీకరణ. మేము ఏ కార్యమును తలపెట్టినా వికేంద్రీకరణ అమలు జరిగేరీతిగా చూస్తాం. అందుకే గ్రామాలలో భూమి విభజనను కోరుతున్నాము.

భూమినమన్య ప్రస్తావన రాగానే సీలింగ్ నిర్ణయించండి. ప్రతివానికి ఎన్ని ఎకరాలభూమి ఉండాలె? కనిష్ఠ గరిష్ఠ భూపరిమితులు ఏమిటి? అన్న ప్రశ్నలు వస్తున్నవి. అందరూ ఈ పంథాలోనే ఆలోచిస్తున్నారు. భూదాన ఉద్యమము తీవ్రముగా కొనసాగుతున్న ఈ సమయములో ప్రజలలో ఒక భావము రూపొందుతున్న ఈ తరుణములో ఈరకమైన ఆలోచనలు సాగుతున్నవి. కాని తక్కువకు తక్కువ ఎన్నెకరాల భూమి మీరు ఇవ్వదలచుకున్నారు. అది ముందు నిర్ణయించండని నేనంటాను. నేనిట్లెందుకంటున్నాను? ఎందుకంటే నేను కర్తృత్వ విభజనను కోరుతున్నాను కాబట్టి ఎంత మంది కార్మికులున్నారో వారందరూ ఇతరుల చేతిలో పని

చేస్తారు. వారు పనయితేచేస్తున్నారు. కాని వారిలో కర్తృత్వ మన్నది లేదు. బండీ నడుస్తుంది. కాని బండిని మనము కర్త అనగలమా? ఎందుకనలేమంటే అది నిశ్చేతనమైనది. అట్లే చేలల్లో పొలాల్లో పనిచేస్తున్న వ్యవసాయ కార్మికులు కేవలము నిశ్చేతనులుగాపనిచేస్తున్నారు. చేతులతో కాళ్ళతో మాత్రమే పనిచేస్తారు. అట్లాకాక వారు తమ సొంత ఆలోచనతోనూ స్వహృదయముతో పనిచేయవలెనని మేము కోరుతున్నాము. భారతీయ కార్మికులలో అంతటి ఆలోచనలేదు. కాబట్టి వారు ఒకరి చెప్పుచేతలలో మెదలడమే మంచిది. వారి మేధస్సును తీసి వేరొకదానిని ఆ స్థానములో పెట్టడము సాధ్యంకాదుగదా!

ఒక కార్మికుని కన్నా కొద్దో గొప్పో డబ్బున్నవాడే కాస్త తెలివిమంతుడై ఉంటాడు నిజమే. కాని దేశము మొత్తముమీదగల కార్మికుల శక్తిని మించినదిలేదు. అంతటి ధీశక్తి లేక బుద్ధిబలము మన దేశమునకు నిరుపయోగ మయినచో ఎంతో గొప్ప నష్టము కాగలదు. కాబట్టి కార్మికుల బుద్ధి బలము అది ఏ పరిస్థితిలో ఉన్నను పూర్తిగా ఉపయోగింప బడవలెను. వారి బుద్ధి బలమును వృద్ధిపరచుటకు వేయుబడు కార్యక్రమములలో వారికి భూమి నివ్వడము ఒకటి. ఇదికాక వారికి చదువు నేర్పడముకూడా అవసరము. వారికి భూమినివ్వడము, విద్య గరపడములో ఒక భాగము. అది వారి బుద్ధి బలమును వృద్ధిపరచుటకుకూడ ఒక సాధనముగాగలదు, ఈ విధముగా కర్తృత్వ విభజన దృష్టితో నేను

ఆలోచిస్తాను. కార్యక్రమ విభాగములు రెండుకూడ నేను మీకు తెలిపిఉన్నాను. ఆ రెంటికి మూల ప్రాతిపదికనుకూడ తెలిపి యున్నాను. కార్యవిధానమును గూర్చికూడ కొంత చర్చించినాను. కార్యవిభజన ఎట్లా చేయవలెనో అదికూడా తెలుసుకొన్నాము. అంతేకాక కార్యక్రమము ఏమయి ఉండ వలెనో దానిని గురించికూడ కొంత విచారించు కున్నాము.

## కార్యాచరణము

ఇక మనము కార్యాచరణను గురించి విచారింతాము. నిర్మాణ రంగములో సర్వసేవాసంఘమని సర్వోదయ సమాజ మని ఈ రెండు ప్రచారములో ఉన్నవి. సర్వోదయ సమాజ మన్నా లేక సర్వసేవా సంఘమన్నా ఏదైనా ఒకటే. అవి చేసే పనులుకూడా ఒకటిగా ఉండవలెను. ఈ రెండుసంస్థలు ఒకదాని సరసన ఒకటిఉంటూ పురోగమించవలెను. సర్వసేవా సంఘము శిథిలసంస్థ కానేరదు. అది ఇంకా పటిష్ఠమౌతుంది. సర్వోదయ సమాజముకూడ శిథిలమైనదికాదు అది కేవలము భావ పటిమను అంగీకరించే సంస్థగా ఉండగలదు. సర్వో దయ సమాజముయొక్క ఆశయాలు ఇంకా ఏమయి ఉండ వలెనో ఆలోచింప వలసి యున్నది. సర్వోదయ సమాజాధి కారము ఏ విధముగా సర్వత్రా అంగీరింప బడుతుంది? అని మనము ఆలోచించకూడదు. ఇక్కడ సమావేశమయిన సర్వో దయ సమాజసేవకులు సేవకులుగా తమ పేర్లను నమోదు చేయించిన వారు చేయించనివారు ఇక్కడికి రానివారు వారం దరిలో ఒకే ఒక భావసరళి వెలుగొంద వలసి యున్నది.

అందుకు మనము కృషిచేయవలెను. సాధారణ ప్రజానీకానికి ... ము ఉండడానికి బాగా ప్రచారముచేయవలెనని ప్రచా... జరుగవలెనని నేను సూచించి యున్నాను. రెండవ సూచన ఏమిటంటే సాహిత్య ప్రచారము విరివిగా కొనసాగవలెను సాహిత్యము మీద వాద ప్రతివాదవలు, విమర్శ ప్రతి విమర్శలు జరుగుతూ ఉండవలెను. సర్వోదయ సిద్ధాంతములను ఇతర సిద్ధాంతములతో పోలుస్తూ అధ్యయనము చేసే సంఘాలు ప్రతిచోటా ఉండవలెను. ఇందుకు మనము ప్రయత్నాలు చేయవలసియున్నది. సర్వోదయ సమాజ నిర్మాణానికిగాను సర్వసేవా సంఘమును సువ్యవస్థితమైన సంస్థగా రూపొందించ వలెను.

ఈ అవసరాన్ని గుర్తిస్తూకూడ మనము చేయ కోరుతున్నప్పటికి ఏమీ చేయలేక పోయినామని నేను ఒప్పుకో వలసి వస్తున్నది. అదిగవక మనము చేయలేకపోతే నా అభిప్రాయములో మనము ప్రజాశయాలను పాటించిన వారము కాము. ఎన్నోసంస్థలు పనిచేస్తున్నవి. కాని, పని అదే పూర్వపద్ధతిన సాగితే అట్టి సంస్థలద్వారా మనము కోరుతున్నటువంటి శక్తి ఉత్పన్నము కాదు. కొన్ని ఉదాహరణములు ఇచ్చేటప్పుడు కొందరి పేళ్ళుకూడ పేర్కొంటాను. అందువల్ల వారికేదో దోషము ఆపాదిస్తున్నానని అనుకోకూడదు. నా దోషమునే ఎత్తి చూపుతున్నాను. ఎవరిముందో కాదు, నా ముందే. హిందుస్తానీ ప్రచారసమితి అన్న పేరుతో ఒకసంస్థ ఉన్నది. అక్కడ ఏమి జరుగుతూఉంటుంది? విద్యార్థులు వస్తూ

ఉంటారు. పూర్వం చాలామంది విద్యార్థులు వస్తూఉండిరి. ఇప్పుడు సంఖ్య తగ్గిపోయి ఉంటుంది. హిందీ ఉర్దూ నాగరి లిపి రెండు నేర్చుకోవాలని సమితి వాదిస్తుంది. అందుకు వారితో వరణ మనుకూలంగా లేదు. అందుకే విద్యార్థులరాక తగ్గి ఉంటుంది. వచ్చేవారు రెండు భాషలనూ, రెండు లిపులనూ నేర్చుకొనే అభిలాష కలిగి ఉంటారు. సమాజమంతా ఒకే ఒక అయ్యుఉంటే, హిందుస్తానీ ప్రచారసమితికి శిక్షణ కొరకు వచ్చేవిద్యార్థులకు నాలుగు గంటల పొలంపనీ, తర్వాత ఒక అరగంటసేపు నూలు వడకడము, పిమ్మట ఒక గంట న్నరసేపు వంట వగైరా పనులు చేసుకొనిచ్చి మిగతా మూడు, నాల్గు గంటల్లో హిందీ లేక ఉర్దూ ఏది నేర్చుకో దలచినట్లయితే అది నేర్చుకోడానికి వీలుగలుగ చేసేవాణ్ణి. కాని నేడు అక్కడ జరుగుతున్నట్లు శిక్షణ జారీఉన్నట్లయితే అందునుండి శక్తి ఉద్దీపితంకాదు. హిందీ, ఉర్దూ ఈ రెండు లిపులను నేర్చుకొన దలచిన విద్యార్థులకు అవి నేర్పినంత మాత్రాన సాధించ గల్గిందేమీలేదు. మీ చెవినికోసి ఇక్కడ వినడానికని పెట్టినయడలనో లేక నా నాలుకనుకోసి భాషించ డానికి పెట్టినయడలనో మీరు వినసూలేరు, నేను చెప్పనూ లేను; ఎందుకనగా నేను, మీరు సమగ్ర స్వరూపులుగా వున్న ప్పుడు మాత్రమే నేను చెప్పడము, మీరు వినడము సాధ్య మౌతుంది; ఇటు నా నాలుక పనిచేస్తే అటు మీ చెవులు పనిచేస్తున్నవి. ఈ విభిన్న అంగముల శారీరక అనుబంధము మాత్రము చాలా ముఖ్యము.

అయితే హిందుస్థానీ ప్రచారసభవారు చేయవలసిన ముఖ్యమైనపని కేవలం నాల్గుగంటల్లోనే పూర్తి అవుతుంది. ఆ నాల్గు గంటలలో నాగరి (హిందీ) ఉర్దూ లిపులను నేర్చుకొనవచ్చును. మిగతా సమయము నేను పైనచెప్పిన రీతిగా సద్వినియోగ పర్చినట్లయితే ఆ ఉర్దూకైనా లేక హిందీకైనా జవసత్వములు ఏర్పడుతవి.

ఇది ఒక దృష్టాంతము. ఇట్టివి ఇంకా అనేకములు గలవు. మన సోదరులు వేరువేరుగావుండి ఎవరికి తోచిన రీతిగా వారు పనిచేస్తున్నందువల్ల ఏకత్రితమైనశక్తి ఎట్లా కలుగుతుంది? సమాజములో క్రాంతి లేక విప్లవము రావాలని మనమంతా ఆశిస్తున్నాము. కాని తదాశయసిద్ధికి అవసరమైన కృషి చేయక పోవుటవల్ల కార్యసాఫల్యతకలుగక పోవడము సహజమేకాదా! దీనికి కారణము ఒకేఒకటి. అది సంఘములన్ని వేరువేరుగా పనిచేయుట. అవిమంచిపనులే చేయవచ్చు; కాని వేరువేరుగా వుండటముపట్ల వాటికి ఆసక్తి మెండు. ఎవరికివారు ప్రత్యేకమైన ఆలోచనలు కలిగివుంటారు. అంతా ఒకచోట సమైక్యమయితే వారి వారి విభిన్న దృక్పథాలకు ఎక్కడ కొట్టువస్తుందో అని వారి భయం అసలు విభిన్న దృక్పథాలకు మధ్య సమైక్యత కుదురుట ఎట్లు? అన్న అనుమానముతో వారు ఆలోచన ప్రారంభిస్తారు. ఏ ప్రణాళికలోనైనా కొన్ని తప్పులు, కొన్ని ఒప్పులు వుండడము సహజము. కాని ఒక సమగ్రదృష్టితో చూస్తే సర్వ సేవాసంఘము

ఒకే ఒక సంస్థగా ప్రాభవం చెందినగాని అపూర్వమైన శక్తి నిర్మాణముగాను అని తోస్తుంది.

### భూదానయజ్ఞములో పాల్గొనడానికి అందరికీఆహ్వానం

మొదటిపని భూదానయజ్ఞము. నేను హృదయగతమై వున్న భావాల్ని మీ ఎదుట ప్రకటిస్తున్నాను. కనీసం 5కోట్ల ఎకరముల భూమి చేతులు మారవలసిఉన్నది. ఈ పని 1957 సం|| ము వరకు పూర్తి గావలెను. ఈ పనికి మనమందరము పూనుకొంటాము. మనమందరము అంటే నేను మీరు ఇంకా సర్వోదయ సమాజము వారందరును. అంతేగాదు ఈ సిద్ధాంతాలను అంగీకరించే కాంగ్రెసువారు ప్రజాసోషలిస్టు మొదలగువారందరు అన్నమాట. ఈ సమస్యను పరిష్కరించడానికి పూనుకొనడం మన కర్తవ్యం. పదహారణాల విజయము సంప్రాప్తమై శాసనము అనవసరమైపోయినా, లేక 12 అణాల విజయము సంప్రాప్తమై మిగిలిన పనికి శాసనము తప్పనిసరి అయినా మన కర్తవ్యమును మనము నెరవేర్చవలెను. నేను భవిష్యద్వాదిని కాను. అది ఏవిధముగా పూర్తి అయినాగాని ప్రధానంగా జనశక్తిద్వారా పూర్తికావడమే మంచిది. జనశక్తిద్వారా కార్యసాఫల్యత సిద్ధించిన ఎడల నేను సంతోషిస్తాను. 1957 వ సం|| మువరకు మనమీపని పూర్తి చేసినట్లయితే రానున్న ఎన్నికలు పార్టీలమధ్యజరుగవు. ఏపార్టీలో ఎక్కువ సజ్జనులున్నారో ఆయా పార్టీలకు మధ్యనే పోటీ జరుగుతుంది. నేడు పరిస్థితి ఎట్లువున్నదంటే ఈ పార్టీలోను సజ్జనులున్నారు.

ఆ పార్టీలోనూ సజ్జనులున్నారు. భీష్మార్జున యుద్ధము జరుగు తున్నట్లుగా వుంది. కాని మేము కోరేది రామ రావణాయుద్ధము, భీష్మార్జున యుద్ధము కాదు. రెండు పార్టీలలోను మంచివారు న్నప్పుడు వారు సమైక్యము ఎందుకు కాగూడదు? రెండు పార్టీలమధ్య ఒక కార్యక్రమముపైన అంగీకారము కుదిరిన యెడల మిగతా అభిప్రాయ విభేదాలు వెంటనే సమసి పోతవి. కార్యక్రమము మూల ప్రాతిపదికగా వుంటుంది గనుక ఇది సంభవం. మా కార్యక్రమాన్ని మీరుతీసుకున్నారని సోషలిస్టులంటారు. అది నాకు అంగీకారయోగ్యము అందుకు మీరు నాతో సహకరించండి అని నేనంటాను ఈ కార్య క్రమము చాలాబాగుంది. దీనిని "మేమే ఆచరించవలసి యుం డెను" అని కాంగ్రెసువారంటారు. వారి సహకారాన్నికూడా నేను కోరుతున్నాను.

ఈ కార్యక్రమము భారతీయ సంస్కృతికి అనుకూ లముగావున్నది. కాబట్టి చాలా బాగుంది అని జనసంఘము వారంటారు. వివిధ అభిప్రాయాలు గలవారు ఈ కార్య క్రమాన్ని ప్రశంసిస్తున్నారు. మనమంతా కలిసి ఈ కార్య క్రమాన్ని అమలు పరిచేందుకు కృషి చేసినయెడల బహుశా వచ్చే ఎన్నికలవరకు అభిప్రాయ విభేదాలు మాసిపోవచ్చు. ఇంకా వచ్చే ఎన్నికలలో ఉత్తమోత్తములైనట్టి వ్యక్తులు ఎన్నుకొన బడవచ్చు. ఆ తర్వాత ఏర్పడు ప్రభుత్వము ఎంత పటిష్టంగా వుండగలదో వేరుగా చెప్పవలసిన పనిలేదు.

ఈ కార్యక్రమము నాలో పై విశ్వాసాన్ని కలిగిం చింది. ఈ భూదాన కార్యక్రమమును మనము కొనసాగించ

వలసి వున్నది. ఐదు కోట్ల ఎకరాలభూమి సేకరించ బడునంత వరకు మనకు విశ్రాంతిలేదు. వచ్చే సం॥ము వరకు 25 లక్షల ఎకరాలభూమి ఎల్లయినా స్వీకరించ వలసిందే.

## సంపత్తి దాన యజ్ఞము

దీనితోపాటు సంపత్తిదానయజ్ఞమును మరొక కార్యక్రమాన్ని ప్రారంభించినాను. ఇది వినా భూదానయజ్ఞము సఫలంకా నేరదు. ఆర్థిక స్వాతంత్ర్యమును, ఆర్థిక సమానత్వమును సాధించడానికి మనం వేసుకొన్న కార్యక్రమము సవ్యముగా కొనసాగ వలెనంటే అందుకు సంపత్తిదానయజ్ఞము యొక్క ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఆదినుండీ నేను దీని అవసరమును గుర్తించేఉన్ననూ, రెండూ ఒకేసారి కొనసాగుట దుస్సాధ్యమనీ అదీగాక భూమిసమస్య మౌలికమైనదనీ అందువల్ల ముందు భూమి సమస్యనే తీసుకున్నాను. భూమి సమస్యతో పోలిస్తే సంపదసమస్య అంత మౌలికంకాదన్నదికూడా ఇందుకు ఒక కారణమయింది. తెలంగాణాలో పర్యటిస్తున్నప్పుడు పరమేశ్వరుని ఆదేశమయింది తదాదేశమును పురస్కరించుకొని కార్యసాధనకు పూనుకొన్నాను. ప్రారంభములో ఒక భూమిసమస్యను మాత్రమే తీసుకున్నాను. బీహారుసమస్యా పరిష్కారప్రశ్న వచ్చేటంతకు కేవలము భూదాన యజ్ఞము మాత్రమే గాక వెంట వెంట సంపత్తిదానయజ్ఞమునుకూడా ప్రారంభించవలెనను సంకల్పము కలిగినది ఇవిరెండూ ఒకదాని

ఆ పార్టీలోనూ సజ్జనులున్నారు. భీష్మార్జున యుద్ధము జరుగుతున్నట్లుగా వుంది. కాని మేము కోరేది రామ రావణయుద్ధము; భీష్మార్జున యుద్ధము కాదు. రెండు పార్టీలలోను మంచివారున్నప్పుడు వారు సమైక్యము ఎందుకు కాగూడదు? రెండు పార్టీలమధ్య ఒక కార్యక్రమముపైన అంగీకారము కుదిరిన యెడల మిగతా అభిప్రాయ విభేదాలు వెంటనే సమసిపోతవి. కార్యక్రమము మూల ప్రాతిపదికగా వుంటుంది గనుక ఇది సంభవం. మా కార్యక్రమాన్ని మీరుతీసుకున్నారని సోషలిస్టులంటారు. అది నాకు అంగీకారయోగ్యము అందుకు మీరు నాతో సహకరించండి అని నేనంటాను ఈ కార్యక్రమము చాలాబాగుంది. దీనిని "మేమే ఆచరించవలసి యుండెను" అని కాంగ్రెసువారంటారు. వారి సహకారాన్నికూడా నేను కోరుతున్నాను.

ఈ కార్యక్రమము భారతీయ సంస్కృతికి అనుకూలముగావున్నది. కాబట్టి చాలా బాగుంది అని జనసంఘము వారంటారు. వివిధ అభిప్రాయాలు గలవారు ఈ కార్యక్రమాన్ని ప్రశంసిస్తున్నారు. మనమంతా కలిసి ఈ కార్యక్రమాన్ని అమలు పరిచేందుకు కృషి చేసినయెడల బహుశా వచ్చే ఎన్నికలవరకు అభిప్రాయ విభేదాలు మాసిపోవచ్చు. ఇంకా వచ్చే ఎన్నికలలో ఉత్తమోత్తములైనట్టి వ్యక్తులు ఎన్నుకొన బడవచ్చు. ఆ తర్వాత ఏర్పడు ప్రభుత్వము ఎంత పటిష్టంగా వుండగలదో వేరుగా చెప్పవలసిన పని లేదు.

ఈ కార్యక్రమము నాలో పై విశ్వాసాన్ని కలిగించింది. ఈ భూదాన కార్యక్రమమును మనము కొనసాగించ

సరసన ఒక టికొనసాగడమే ఉత్తమ మార్గముగా తోచింది. సంపత్తి దాన యజ్ఞమును గురించి నేనిక్కడ విస్తారముగా చెప్పదలచుకోలేదు. దానిని గురించి ఇదివరకే విపులంగా వ్రాసిఉన్నాను, చెప్పిఉన్నానుకూడా. ముఖ్యమైన మాటలు మాత్రము తెలుపుతాను. సంపదను వసం మన చేతులలోకి తీసుకొనడంలేదు. దాత తానుచేసే దానమును సద్వినియోగ పరిచే అధికారమును కలిగి ఉంటాడు. ఇది మన ప్రణాళిక. భూదాన యజ్ఞమునకొరకు ఊరూరా తిరిగి సామూహికంగా పెద్దపెట్టున సాగిస్తున్నట్టి ప్రచారము ఈ సంపత్తిదాన యజ్ఞానికి అక్కరలేదు. వ్యక్తిగతంగా, సాదరంగా మాట్లాడు వ్యక్తులలోనూ, కుటుంబాలలోనూ సంపత్తిదానయజ్ఞ ప్రాముఖ్యమును వివరించి వారిలో దాతృత్వ భావాలను పురికొల్పవలెను. ఇంతవరకు ఇవ్వబడినసంపదదానాలు ప్రతిఏటా ఇవ్వబడేటివి. యావజ్జీవితమూ వారు సంపత్తిదానం చేస్తూనే ఉంటారు. దానమునుస్వీకరించునపుడు నేను బాగాఆలోచించే అట్లా చేసినాను, కేవలము ఉత్తేజ పరచడమే కాక కొంత నిమంత్రణంకూడా చేయవలసి వచ్చింది. దాదాపు 40, 45 మంది పేర్లు నా దగ్గర ఉన్నవి. ఈ విషయంపైన ఇంకా ఎక్కువ మాట్లాడను. ఒకటి మాత్రం మీ అందరికీ చెప్పదలచుకున్నాను. మీలో ఎవరిదగ్గర అయినా మూట ఉన్నట్లవుతే ఆ మూటను ముందు వదలిపెట్టి ఆ పిమ్మట ఇంటులో చేరండి. మీ మీ మిత్రులలో ప్రేమతో ఈ దాతృత్వ భావాన్ని ప్రచురితంచేయండి. ఇవి రెండుపరస్పరం అనుసంహితమై ఉన్న పనులు. ఇప్పుడు 24 లక్షల ఎకరాల భూమిని సేకరించ

వాలెనని సంకల్పించుకొన్నాము. ఈ సత్సంకల్పసిద్ధికే ఎక్కువ కృషి చేయవలసిఉన్నది. సంపత్తి దానయజ్ఞము సార్వజనీనంగా నిర్వహించునసమయం ఇంకా ఆసన్నం కాలేదు. అయినా వ్యక్తిగతముగా మనమెంత చేయగలిగిన అంత చేయుట సుకరము.

## నూలు సమర్పణము

ఇవి రెండే గాక మరొకటి కూడా మనం చేస్తూ ఉన్నాము. అది నూలు సమర్పణము. ఇది గొప్ప శక్తియుతమైనది. ఆ శక్తిని మనమింకా గుర్తించజాలక పోతున్నాము. బాపూజీ స్మృతి చిహ్నంగా, శరీరశ్రమయొక్క గౌరవాన్ని పెంపొందించడానికి, దేశీయ సిరిసంపదలను వృద్ధిపొందించ వలసిన బాధ్యతలను గుర్తెరిగి నూలును సమర్పించవలెను. ఇది చాలా గొప్పవిషయం. ఇందుకు ఒకచిక్కు ఏమిటంటే ప్రతి ఇంటికీ వెళ్ళవలసి ఉంటుంది. ఊరూరూ తిరుగవలసి ఉంటుంది. కాని ఇది ఒక అంతరాయమని నేననుకోను. నిజంగా ప్రోత్సాహకరమైన ఉద్యమమిది. ఈమిషతో మనం ప్రతిఇంటికి వెళ్ళవచ్చునుకదా! కాబట్టి ఈ ఉద్యమమును అందరూ ప్రోత్సహించవలెను. 25లక్షల ఎకరాలభూమి సేకరించుట కెట్లు పూనుకొన్నామో అట్లే లక్షలలడ్డీలను మనము ప్రోగు చేయవలెను. శ్రమవిలువను పెంచడానికి అది చాలా ఉపయోగపడగలదు.

## శ్రమ – గౌరవము

ఇది గాకనూ అందులో మరొక విశేషముంది. అదేమిటో మీకు చెప్తాను. ఇంతవరకు ఎన్నిసంస్థలను నెలకొల్పినామో అన్నిటినీ అర్థబలంతోనే నడుపుతున్నాము.

డబ్బుగలవారు, మిత్రులైనవారు, సహృదయులైనవారు, ప్రేమగలవారు ఇస్తూఉండేవారు. మనము స్వీకరిస్తూఉండేది. కాని నేడు కాలం మారింది. శ్రమకు గౌరవం ఏర్పడే రోజులు ఇవి. కనుక ప్రతి ప్రాంతంలోనూ కేవలం శ్రమాధారంపైన సంస్థను నిర్మాణం చేయగలిగితే చేయడం మంచిది. స్వీకరిస్తే శ్రమదానం మాత్రమే స్వీకరించవలెను. నూలు సమర్పణ ఉద్యమం బాగా వ్యాప్తి జెందితే ఇటువంటి సంస్థలను మనం సులభముగా నిర్వహించగలము. ఈ ఉద్యమంనుంచి తేజస్వులైన కార్యకర్తలు తయారు కాగలరు; వారు అటు ప్రచారములోనూ పాల్గొంటారు, ఇటు పనిలోనూ పాల్గొంటారు. ఇట్టి శ్రమశీలురైన కార్యకర్తలను సిద్ధం చేయడానికి ఈ ఉద్యమ ప్రణాళిక చక్కని అవకాశమును కల్పిస్తున్నది.

## మనం మనుష్య మాత్రులం

చివరకు రెండు మాటలు చెప్పదలచుకొన్నాను, మనం చేస్తున్న పని సంకుచితం కాదు. మీరు "సర్వోదయ వాదులు" అను మాటలు అసలు వినరాకూడదు. మనం కేవలం మనుష్య మాత్రులం, మానవాతీతమైన శక్తిగలవారము కాము. ఏదైనా ప్రత్యేక అనుశాసనం సహాయంతో చూస్తూ చూస్తుండగనే "సర్వోదయ సమాజ"మును నిర్మాణము చేయకున్ననూ, పతితులమయినా కాగలము కదా! ఒక సంప్రదాయమును నెలకొల్పినవారము కాగలముగదా! అయితే ఫలానావారు కాంగ్రెసువారనీ, ఫలానావారు సోషలిస్టులు; ఫలానావారు సర్వో

దయావాదాలు అన్న విపక్షత పొడసూపే పరిభాష సుతరామూ ప్రయోగించ కూడదు.

## తృతీయశక్తి

నానారకాలుగా పేర్లుగలవారు ఆయాపేర్లతో పని చేసుకొన్నారు గనకనూ వారికి ఆ పేర్లతో వ్యవహరింప బడుటలో ప్రయోజనమున్నట్లు వారు విశ్వసిస్తారు గనకనూ, వారు తమ తమ పక్షాలను వేర్వేరుపేర్లతో నిర్వహించు కొనవచ్చును. కాని మనకు ఏ పార్టీలు లేవు. నేడు తృతీయశక్తి అంటే, అటు అమెరికా కూటమిలోనూ, ఇటు రష్యా కూటమిలోనూ ఎటూ చేరకుండా తటస్థంగా ఉండునది తృతీయశక్తి అని సాధారణంగా వాడుక. కాని నా పరిభాషలో తృతీయశక్తి అంటే, హింసాత్మకశక్తికి విరోధి అయినట్టిదీ, హింసాత్మకశక్తి కానటువంటిది, దండనశక్తికి విభిన్నమయినట్టిదీ, దండనశక్తి కానటువంటిది. ఇటువంటి శక్తినే నేను తృతీయశక్తిగా భావిస్తాను. ఒకటి హింసాత్మక శక్తి, రెండవది దండన శక్తి, మూడవది మన శక్తి. ఆ శక్తినే మనం సర్వవ్యాపకం చేయదలచుకొన్నాము. దానిని సంకుచితం చేయకూడదు. మనమంతా సాధారణ ప్రజానీకంలో కలిసిపోవలెను; వారితోపాటు సామాన్య మానవమాత్రులం కావలెను.

చాండిల్, 7 మార్చి 1953

# రెండు ముఖ్య ప్రశ్నలు



నేడు మూడు ముఖ్య విషయాలపైన నా అభిప్రాయాలను ప్రకటించుటకు నిశ్చయించుకొన్నాను: 'సర్వోదయసమాజ' సేవకులమైన మన వైఖరి ప్రభుత్వ ప్రణాళికల పట్లనూ, వివిధ రాజకీయ పక్షాలపట్లనూ ఏ రీతిగ ఉండవలె నన్నది మొదటిది. రెండవది, భూదానయజ్ఞ కార్యక్రమాను అభివృద్ధి పరచడానికి నేను ఆలోచించిన ఒక ఉపాయము. మూడవది. ఆత్మపరీక్ష చేసుకొని మనలోగల లోపాలను, దోషాలను గురించి కొంత చర్చించి వాటిని దూరం చేసుకొను పద్ధతి. ఈ మూడవవిషయం కొంచెం లోతైనది. కాబట్టి దానిని గురించిన చర్చ ఈ ప్రసంగంలో చేయను. సాయంత్రం జరిగే చివరి ప్రసంగంకోసం ఆ విషయాన్ని వదలివేస్తున్నాను.

## 1. రాజకీయపక్షాలు: మన వైఖరి

భూదానయజ్ఞము ప్రసక్తివచ్చినపుడల్లా దానికి ప్రేరణ నొసగగల నాలుగు మాటలు మాట్లాడి నేనంతటితో సంతుష్టి జెందను. జీవితాన్ని గురించిన ఒక పరిపూర్ణ దృక్పథాన్ని సూచించే సర్వోదయ సిద్ధాంతాలు, వాటికి సంబంధించిన అనేక ఇతర విషయాలు—వాటన్నిటినీ చర్చిస్తాను. ఒకో-

సారి వ్యాఖ్యానం విస్తారమైపోయి అందులో ముఖ్యమయిన భూదానయజ్ఞం విషయం సూక్ష్మంగానే ఉండిపోతుంది. ఇతర తత్సంబంధ విషయములపైన ఎక్కువ అవసరం కనుక నా ప్రసంగంలో ఆ ధోరణే ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ప్రజలు నన్ను అనేక ప్రశ్నలు అడుగుతారు. వాటన్నిటికీ సమాధానాలు చెప్తాను. ఈ విధంగా నేను జ్ఞాన ప్రచారంలో నిమగ్నుడనై ఉన్నాను. అందుకే ఒక ప్రత్యేక విషయముమీద పట్టింపు కనబరచుటకంటె వివిధ విషయ చింతనయే ఎక్కువగా వచ్చుతుంది. కాని ఒకపనిని చేబూని తిరుగుతున్నాను. అది నేను విస్మరించుటకు వీలులేదు. అయినా అనేక విషయాలనుగురించి ముచ్చటించవలసి వస్తుంది. ప్రజలు వివిధ ప్రశ్నలు అడుగుతారు; ప్రత్యేకంగా కమ్యూనిటీ ప్రాజెక్టుల గురించి, నేషనల్ ప్లానింగ్ గురించి వారడుగుతుంటారు. కేవలము ఇవేగాక అనేక పార్టీల సిద్ధాంతాలు ఆశయాలను గురించికూడా ప్రశ్నలు వేయబడుతవి. వాటన్నిటికీ సమాధానమిస్తాను; ఒక సోదరుడు నా సమాధాన ధోరణిని గురించి ఈ విధంగా ప్రశ్నించాడు. "ప్రభుత్వము వివిధ పక్షాలపట్ల అవలంబిస్తున్న వివిధ వైఖరులతో ఆ పక్షాలకూ ప్రభుత్వానికీ మధ్య ఏకాభిప్రాయం ఎట్లా కుదురుతుంది? మీరు వీరి మధ్య ఏకాభిప్రాయం కుదర్చడానికి ప్రయత్నిస్తుంటారు; కాని మీ ప్రయత్నము నాకు అసహజ యత్నముగా తోస్తుంది. అసలు జరుగవలసిందేమంటే ప్రభుత్వానికీ మనకూ మధ్యగల విభేదాలేమిటో; అవి ప్రజల ఎదుట స్పష్టముగా ఉంచవలెను. అదీ అసలు మన కర్తవ్యం. అట్లాకాక విభేదాభిప్రాయాలను

సరకుగానక ప్రభుత్వానికే తోడ్పడే ప్రయత్నము చేయడము అస్వాభావికముకాదా!” ఒకసర్వోదయాభిమాని ఈవిధముగా తమఆక్షేపణను తెలియజేసినారు. కనుకనాదృక్పథాన్ని సర్వోదయసమ్మేళనములోనే వివరించడానికి పూనుకున్నాను.

## అభిప్రాయ విభేదాలు

మొట్టమొదలు ప్రభుత్వ ప్రణాళికనుగురించి చర్చింతాము. దానిని గురించిన మాఆక్షేపణ ఏమంటే మనకు ప్రభుత్వానికీమధ్య దృక్పథ విభిన్నత్వము ఉండడం. ఈ ఒక్క ఆక్షేపణ వెనుక ఒకటొకటిగా అనేక ఆక్షేపణలు బయల్దేరుతున్నవి. ప్లానింగ్ కమిషన్‌ముందు ఈ విషయాన్ని ఎంత స్పష్టీకరించవలెనో అంత స్పష్టీకరించినాను. కమిషన్ సభ్యులు కూడా నా అభిప్రాయాలను అర్థంచేసుకోవడానికి ప్రయత్నము చేసినారు. ప్లానింగుకమిషన్ తయారు చేసిన క్రొత్తరిపోర్టు ఇంకా మార్పులకు లోను కాగలదనీ అది తుదిది కాదనీ వారు భావిస్తారు. మొదటి రిపోర్టుతో దీనిని పోల్చిచూడగా అనేక మార్పులు అగుపించగలవు. అక్కడికీ దృక్పథ విభిన్నత్వము ఉన్నచోట వారి ఆలోచనకు మన ఆలోచనకు మధ్య గొప్ప అంతరం ఏర్పడుతుంది. దానిని నేను మాటమాటకీ పునరుచ్చరించను. ఎవరయినా ప్రశ్నిస్తే దృక్పథాలలో విభిన్నత్వం ఉన్నది మటుకు తెలుపుతాను.

## మంచి ఎక్కడో మన మక్కడ

మొత్తముమీద ప్రభుత్వ ప్రణాళికపట్ల నేను సానుభూతినే ప్రకటిస్తూ ఉంటానని ప్రజలలో వాడుక ఉంది; అది

నిజమే. ఎందుకంటే ఒక విషయముమీద అభిప్రాయ విభేద మున్నంత మాత్రాననే సంబంధాలను తెడియగొట్టుకొనడము నాకు బాగనిపించదు. ప్రభుత్వ ప్రణాళికను అపజయముపాలు చేయవలెనంటే చేయగలిగినశక్తి మనలో ఉన్నది. కాని ఇది గొప్పశక్తికాదు. మన కార్యక్రమమును ప్రణాళికను ప్రజల ఎదుటపెట్టి వారిని మెప్పించి ఎన్నికలయి ప్రభుత్వమునుఏర్పరచి ఆ ప్రణాళికను ఆచరణాన్వితం చేసేశక్తి నేడు మనలో ఇంకా కలుగలేదు. ఒకదానిని పడగొట్టేశక్తి మనలో ఉన్నది, కాని ఆ శక్తిని ఉపయోగించి ప్రజలలో అశ్రద్ధ అభిప్రాయ విభేదాలను పెంపుజేసి, ఆప్రణాళికలో ఉన్న కాస్తోకూస్తో మంచికూడా మరుగునపడి, ఆ కాస్త అయినా అమలుపరచ బడకపోతే అందువల్ల కలుగు ప్రయోజనమేమి? అది అహింసాసిద్ధాంతానికి విరుద్ధమైనది. అహింసాత్మకదృష్టికి ఇది సముచితమైనదిగా అగుపించదు. దండనశక్తిపై ఆధారపడు ప్రభుత్వము నిర్వహించే ప్రణాళికలు మనకు అంతగా అనుకూలముగా ఉండవు. అందులో ఉన్న మంచిని స్వీకరించి దానిపట్ల ప్రజలలో శ్రద్ధ కలిగించడము మన కర్తవ్యమయి ఉన్నది. విమర్శిస్తూనే ఉంటే పరిణామతః ప్రజలలో నిరుత్సాహము, అవిశ్వాసములు ప్రబలి ఆ ప్రణాళికను వారు అమలుపరచకుండా పోతారు. అందువల్ల మనకుకలుగు లాభమేమి? ప్రణాళికను అమలుపరుస్తే అప్పుడు మనకు దానివల్లకలుగు కొద్దో గొప్పో లాభాలు ఉండగలవు. కాబట్టి మన ప్రణాళికను ప్రజల ఎదుట పెట్టడము తోపాటు ప్రభుత్వ ప్రణాళికలో గల మంచి అంశాలను స్వీకరించడమే సరియైనపద్ధతి.

## పరస్పర విశ్వాసము

ఒకరిని విమర్శించునపుడు ఎదుటివాని ఆశయాన్ని కూడా శంకిస్తారు. అది నా దృష్టిలో న్యాయంకాదు. ఒకరి ఆశయాల్ని శంకిస్తున్నప్పుడు మనఆశయాల్ని శంకించడానికి ఇతరులకు అధికారమిస్తున్నామన్నమాట. నన్ను సంశయించడానికి ఒకరికి ఆస్కారము కల్పించడము నాకు సహించదు. అందరికీ నా ఆశయాలపై విశ్వాసము ఉండవలెను. వారందరి మీదా నాకు విశ్వాసము ఉండవలెను. ఈ విధముగా పరస్పరము విశ్వాసము ఉండడము ఎంతైనా అవసరము.

## మౌలిక విభేదాలు

నేటి ప్రభుత్వముమీద పెట్టుబడిదారుల ప్రభావము ఎక్కువగా ఉన్నది. అది నాకు తెలుసు; దానిని నేను ఒప్పుకుంటాను. అప్పుడప్పుడు దీనిని బహిరంగంగాకూడా ప్రకటిస్తూ ఉంటాను. అందుకు కారణమేమయి యుండవచ్చును? ప్రభుత్వము పెట్టుబడిదారీ విధానాన్ని కోరుతున్నదని కాదు. ప్రభుత్వంలో ఉన్నవారు తమను కొంతవరకు నిస్సహాయులుగా భావిస్తారు. రెండవకారణమేమంటే వారు నేటి ఆర్థిక సాంఘిక రంగాలలో పెట్టుబడిదారుల మేధస్సుశక్తి ఉపయోగము కావాలని వాంఛిస్తారు. వారి ఆలోచనలుకూడా కొన్ని అందుకు అనుకూలముగా ఉన్నవి. ఈ మాటలు నేను నేటి ప్రభుత్వములో ఉన్నవారినిగురించే అనడములేదు; రేపు అధికారములోకి వచ్చి ప్రభుత్వయంత్రాన్ని నిర్వహించు భారము

బూనేవారిని గురించికూడా ఈమాటలు అంటున్నాను. కడకు కమ్యూనిస్టులకుకూడా నా ఈమాటలు వర్తిస్తవి. మన ప్రణాళికలో వికేంద్రీకరణ అంటే విభజనఉంది. కాని కమ్యూనిస్టులు ఉత్పత్తి వికేంద్రీకరణమును అసలు పరచరు. తమను వామపక్షీయులుగా పురోగాములుగా లేక అభ్యుదయవాదులుగా ప్రకటించుకొనువారికీ, పెట్టుబడి దారులకూ ఈ విషయముమీద అంతగా అభిప్రాయవిభేదము లేదు. ఇరువురూ పెద్ద పెద్ద పరిశ్రమలద్వారా ఉత్పత్తి కావాలని వాంఛిస్తారు. ఉత్పత్తి కేంద్రీకృతం చేయాలన్న దానిమీదకూడా వీరిద్దరికీ ఏకాభిప్రాయమే ఉన్నది. విభజన లేక వితరణ దగ్గర వీరిద్దరిలో విభేదమున్నది. కాని పెట్టుబడి దారులకు మనకూ మధ్య కేవలము వితరణ లేక పంపిణీలోనేగాక ఉత్పత్తి విధానములోగూడా అభిప్రాయవిభేదముఉన్నది. అయితే ఒకదాని మీద వీరిద్దరికీ ఏకాభిప్రాయము ఉన్నది. అంటే ఉత్పత్తి విధానములో కమ్యూనిస్టులూ, కేపిటలిస్టులూ ఇద్దరూ ఒకటే. కమ్యూనిస్టులుకూడా ఒక విధమైన పెట్టుబడిదార్లే. కాని మన విధానానికీ, పెటుబడిదారీ విధానానికీ ఎక్కడా సామ్యము లేదు. ఇవి మనకూ ప్రభుత్వానికీ కమ్యూనిస్టులకూ మధ్యఉన్న విభేదాలు. ఈ దృష్టితో మన మాలోచిస్తే ఎవరి ఆశయాలనుకూడా శంకించడానికి ఆస్కారముండదు; అందరి ఆశయాలూ ఆలోచన తీరులు మనకు స్పష్టముగా కనిపిస్తవి. మన ఎదుటివారి పరిస్థితిలో మనమున్నటు భావించి వారి దృక్కోణముతో చూస్తే, అట్టి పరిస్థితిలో మనము ఉన్నా అంతేచేసేవారమని బోధపడగలదు. అయితే ఈ దృష్టి ఇతరు

లను సరిగ్గా అర్థం చేసుకొనడానికి ఉపయోగపడుతుంది. కాని మనముందు ఒక విస్పష్టమైన మార్గమున్నదనీ ఆ మార్గాన అనుగమించి చేరుకోవలసిన ధ్యేయమేదో అది మనకు బాగా తెలుసుననీ నేనిదివరకే ప్రకటించి ఉన్నాను. అది నిశ్చిత మార్గము.

## ప్రభుత్వముతో సహకారము

"ప్రభుత్వ ప్రణాళికను ఎంతవరకు బలపరచి దానితో సహకరించుచుమంటారు?" అని ప్రజలు నన్నడుగుతూఉంటారు. ప్రభుత్వ ప్రణాళిక మనకు సంపూర్ణముగా లేక కొంతవరకు అంగీకృత మయినప్పటికినీ మనం చేయగలిగిన సహాయము చేయవలసిందే, కాని మనమెప్పుడూ స్వతంత్రులముగా ఉండవలెను. ఏదో ఒక కమ్యూనిటీ ప్రాజెక్టుఉండి అందులో మనం చిక్కు పడిపోవడము నాకు నచ్చదు. వారు మనతో సంహాసంప్రదింపులు చేయదలచుకొన్నట్లయితే చేసుకొన వచ్చును; నైమిత్తిక సహాయమేదైనా చేయదలచినయెడల చేయ వచ్చును. కాని అట్టి ప్రణాళిక బాధ్యత యావత్తూ మనము స్వీకరించడము భావ్యముకాదు. అది కూడనిపని. 'సర్వోదయ సమాజము' ఒక స్వతంత్ర సంస్థ; కనక సర్వోదయ సమాజ వ్యక్తులు ఒకొక్కప్పుడు అటువంటి భారములను స్వీకరిస్తారు. స్వతంత్రసంస్థ కాబట్టి ప్రతివారు స్వయముగా ఆలోచించుకొనవచ్చును. కొందరు కమ్యూనిటీ ప్రాజెక్టు బాగుందని నిర్ణయించుకొని దానినిర్వహణలో తోడ్పడుతారు; మరికొందరు దానిని విమర్శాత్మకదృష్టితో చూస్తారు. దేశాన్ని ఈ కమ్యూ

నిటీ ప్రాజెక్టులు పూర్తిగా నాశనము చేస్తాయని వారు భావిస్తారు. వీరుకాక తృతీయవర్గమువారుకూడా ఉన్నారు. వారు ఇందులో కొంత మంచిఉంది, కొంత చెడుఉంది. అని అంటారు. కాని మనల్ని ఈ పనిచేయుమని ప్రభుత్వమంటే అందుకు మనము కొన్ని షరతులు పెట్టవలెను. ఆ షరతులను ప్రభుత్వము ఆమోదిస్తే మన పంథాలో పనిచేయుడానికి వీలు ఉంటుంది. ఏనుగ నడకను గురించి సామెత చెప్తారు. దాని దారే దానికి. చుట్టుప్రక్కల హడావుళ్లూ, ఆర్భాటాలు ఎన్నయినా అది వాటిని ఏమాత్రం పరకుగొనదు. ఏనుగ తనదారి తానుపోతుంది. కాని దారిలోని అరుపులమీద దానికెందుకు ధ్యాస? ఇంకా దీన్ని విపులీకరించను. ఆ సామెతను బాహాటముగా ప్రకటించడానికి దాన్ని రచించిన రచయితకే అధికారముంది; నాకంతటి అధికారములేదు. అట్లే అస్తమానమూ మన సిద్ధాంతాల నెట్లా ప్రాచుర్యానికి తీసుకరావలెనన్నదే ఆలోచనలో ఉండవలెను. ఇతరులనువిమర్శించ డానికి కొంత శక్తిని వినియోగించక తప్పదు. కాబట్టి విమర్శ, శక్తిక్షయమని నేను భావిస్తాను. అందుకే నేను విమర్శలలో ఎప్పుడూపడను. విమర్శలలో అంతగా పడకూడదనే నా అభిప్రాయము. ఒక వంక విమర్శిస్తూ రెండవ వంక వారి ప్రణాళికలలో చిక్కుకొనడము ఈ రెండూ తప్పులే. ఈ రెండింటి వల్లనూ మనకు నష్టమే ఉన్నదని నా విశ్వాసము.

### రాజకీయ పార్టీలను రూపుమాపడము

మరి నేడు వివిధరాజకీయపార్టీలు ఉన్నవికదా! ఆయా పక్షాలపట్ల మన దృక్పథమేమి? ఈ రాజకీయ పక్షాలన్నీ

రూపుమాసిపోవాలనే నాఅభిప్రాయము. నేను చేయవలసిన ప్రయత్నము చేసినమీదటకూడా అవి ఉంటే ఉండనీగాక. అన్ని పక్షాలవారికీ అంగీకార యోగ్యమయిన కార్యక్రమాన్ని సిద్ధపరచి ప్రజలముందుంచి దానిని అమలుపరచడానికి అందరూ తమ అభిప్రాయ విభేదాలను మరిచి పనిచేయ వలెనని తీవ్రముగా ప్రచారము చేయవలెను. ఇటువంటిసర్వామోదనీయమైన కార్యక్రమముమీద అంతాకలిసి కట్టుగా పనిచేసిననాడు రాజకీయకక్షలు విభేదాలు మటుమాయమైపోతవి. ఇటువంటి ఉత్తమ కార్యక్రమమొకటి సిద్ధము చేయబడి, అందరూ ఏకత్రితమై దానిని అమలుపరిస్తే ఆ పనిలో అందరూ ఉత్తములే నిమగ్నులై పోతారు. ఇక 1957 సంవత్సరములో జరిగే ఎన్నికలలో ఉత్తములకూ, ఉత్తములకుమధ్య పోటీ ఉండకూడదు.

## సౌజన్యము — దౌర్జన్యము

నేడు కురుపాండవుల సామ్యము కనిపిస్తున్నది. కౌరవుల పక్షము కొందరు మంచివారుంటే, పాండవుల పక్షము కొందరు చెడ్డవారున్నారు. ఇరుపక్షాలలోనూ మంచివారు ఉన్నారు; చెడ్డవారుఉన్నారు. ఒక మంచివ్యక్తిఎదుట మరొక మంచి వ్యక్తి నిలుస్తున్నాడు. ఇటువంటి స్థితి రాకూడదు. మంచివారంతా ఒక పక్షము చెడ్డవారంతా ఒకపక్షము కావలెను. దౌర్జన్యానికి సౌజన్యం విరోధముగా ఉండవలెను.

## పశ్చిమ ప్రజాస్వామిక సిద్ధాంతము

పశ్చిమ దేశాలనుండి ప్రజాస్వామ్యమను పేర ఒక సిద్ధాంతము దిగుమతియైనది. ప్రభుత్వ నిర్వహణకు గాను రెండు

పక్షము లుండవలెనని ఆ రెండు పక్షములమధ్య సహాయక సంఘర్షణ ఎప్పుడూ జరుగుతుండవలెనని, అందువల్ల లోపములు బయల్పడ గలవని ప్రజాస్వామములో విశ్వసింప బడుతున్నది. ఆ సిద్ధాంతము బాగానేఉంది; కాని దానివల్ల కొన్ని లోపాలు ఉన్నవి. ఆ లోపాలు దూరము చేయబడుట అవసరము. నేను ఇంతకు పూర్వమే తెలిపినట్లు మన దేశపు ప్రాచీన రాజకీయానుభవము గ్రామ పంచాయితీ పాలనమై ఉండెనన్నది బయల్పడుతుంది. అయిదుగురు పంచులు కలిసి నారాయణ అంటే కాని ప్రస్తావనఅయినా, తీర్మానమైనా నెగ్గేది. అయిదుగురిలో ఏ ఒకరో, ఇద్దరో, ముగ్గురో కడకు నలుగురయినా ఆమోదించడము సరిపోదు. కాని ప్రజాస్వామ్య పద్ధతిలో అధికసంఖ్యాకుల అభిమతము నెగ్గుతుంది. సత్యము, న్యాయము అందరికీ ఒకటే అయినప్పుడూ అంతా ఏకాభిప్రాయానికి రావలెనన్నది మనవిశ్వాసము. ఈ విశ్వాసాన్నే నేను 'అంతా కలిసి నారాయణ' అనే మాటలలో తెలుపుతాను. నారాయణు డొక్కడు, విశ్వాసమొక్కటి. ఈ కృషితో మనము పని చేయకపోతే ప్రపంచములో నేడు తలలెత్తిన అనేక అధికసంఖ్యాకుల అల్పసంఖ్యాకుల సమస్యలు పరిష్కృతము కావు.

## అభిప్రాయ విభేదాలపై చర్చ - ఆచరణలో ఐక్యత

జీవము మొత్తములో సద్భావాలను నెలకొల్పడానికి ప్రయత్నము జరుగవలసిఉన్నది. నేడు వివిధ రాజకీయపక్షాలు ఉన్ననూ, ఏ ఒక్క అంశముమీదనయినా వాటిమధ్య ఏకాభి

ప్రాయము ఉన్నప్పుడు సామాన్యముగా అనేక అంశాలపైన ఏకాభిప్రాయమే ఉంటుంది. అందరూ ఆమోదించగల కార్యక్రమమునురూ పొందించవలెను. ఇక అభిప్రాయ భేదములు పరస్పరము చర్చించు కొనబడవలెను. అంతేగాని అభిప్రాయ భేదము చర్చాంశముగా మాత్రమే ఉండకుండ అదే ఆచరణీయాంశముకూడా అయితే అది నా దృష్టిలో సరియైన పద్ధతి కాదు. ఒక విషయముపైన అయిదుగురు మంచివారికీ నలుగురు చెడ్డవారికీ మధ్య అభిప్రాయభేదము ఉందనుకోండి. అప్పుడు ఈ అయిదుగురు అధికసంఖ్యాకులు ఒక నిర్ణయానికి వచ్చి, ఆ నిర్ణయము ప్రకారముగా అమలు చేయుటను నేను సమర్థించను. ఆ అయిదుగురు మంచివారు చేసిన నిర్ణయము ఆచరణ యోగ్యతను పొందలేదనే నేను విశ్వసిస్తున్నాను. దానిపైన విచారణ జరుగుట చర్చలు కొనసాగుట అత్యావసరము. ఏ విషయముమీద ఏ మాత్రముకూడ అభిప్రాయ విభేదము లేదో అది మాత్రమే ఆచరణకై స్వీకరించ బడవలెను. వివిధపక్షాలకు చెందిన సజ్జనులందరిచేతా ఆమోదింపబడిన కార్యక్రమమే ప్రజల ముందుకు ఆచరణకు రావలెను. మరి ఎవరిని సజ్జనులనవలెను; ఎవరు మంచివారు, ఎవరు కారు అన్న ప్రశ్నకు ఇక్కడ ఆస్కారము కలుగుతున్నది. కాని ఆ చర్చలలోపడుట అప్రస్తుతము అసందర్భంకూడా. దేశములో నేడు ఉన్న వివిధ రాజకీయపక్షాల మధ్యగల విభేదాలను రూపుమాపుటకు నేనొక ఆలోచనను మీముందు ఉంచినాను. ఆ ఆలోచనకు ఆచరణరూప మివ్వడము మన కార్యదీక్షపైన ఆధారపడి ఉన్నది. గీత ఈ విషయమై మనకొక అమృత

వచనాన్ని ప్రబోధిస్తున్నది. "పై పైకి భేదాలు కనుపిస్తవి కాని అవి వాస్తవికమైనవి కావు." అందులో ఏదో ఒక విశేషము ఉంటుంది. దానిని మనము గుర్తించవలెను. అప్పుడుగాని ఐక్యతకు భూమిక ఏర్పడదు. ప్రపంచములో భేదాభిప్రాయాలు ఎట్లయినా ఉంటవి. కాని అవి అభిప్రాయాలమట్టుకే ఉండుట మంచిది. ఇది తత్వజ్ఞానమునకు సంబంధించిన సూత్రము. మన పూర్వులు, శాస్త్రకారులు అంగీకరించిన సూత్రమిది. హిందూ మతములో అనేక కోవలు ఉన్నట్లు మీరెరుగుదురు. ఆస్తికులున్నారు, నాస్తికులున్నారు. ఇంకేకోవకు చెందిన వారైనా హిందూ మతములో వారందరికీ స్థానమున్నది. వారంతా ఒకరిమీద ఒకరు తీవ్రముగా ప్రచారాలు చేసుకొంటారు, వాదోపవాదాలు జరుగుతవి, చర్చలు జరుగుతవి. సంస్కృత సాహిత్యములో ఎంత భావ స్వాతంత్ర్యమును నేను చూచినానో అంత మరే ఇతర భాషాసాహిత్యములోనూ చూడలేను. ఇరువురి మధ్యన ముఖాముఖి వాదాలు జరుగుతున్నప్పుడు చూచి తీరవలసిందే. రామానుజ శంకరుల సిద్ధాంతాలలో విభిన్నత్వమున్నది. వారి అనుయాయులు ఒకరినొకరు ఆక్షేపించుకొంటారు. ఒకరికి విరుద్ధముగా ఒకరు గంభీరోపన్యాసములను గావిస్తారు. కాని పరస్పరము ఒకరి భావసరళిని ఇంకొకరు అర్థముచేసుకోనిదే విమర్శ ప్రతి విమర్శలకు దిగరు. ఇంత జరిగినా ఆచరణ శాస్త్రమని దేనినైతే అంటారో దానిపైన మాత్రము ఏమాత్రము అభిప్రాయ వైవిధ్యము లేదు. సత్యమును ఇరువురూ అంగీకరిస్తారు. అహింసను ఇరువురూ ఆమోదిస్తారు, సదాచారమును ఇరు

పురా సమర్థిస్తారు. ఈ విధముగా కొన్ని విధులను వారిక పురా పాలిస్తారు, కొన్ని నిషేధాలను ఇరువురూ పాటిస్తారు రామానుజుని రాజ్యములో అంతా బ్రాద్దున్నే లేస్తే శంకరుని రాజ్యములో ఎవరూ బ్రొద్దున్నే లేవగూడదని ఎక్కడా లేదు. ఈ విధముగా కార్యక్రమములో ఐక్యత ఆధారము మీద మనము పురోగమించిన యెడల దేశముకూడా పురోగమిస్తుంది. సమాజములో స్థిరత్వము నెలకొంటుంది. ఇక భావ వైవిధ్యము వైరుధ్యములున్నచోట సవిమర్శకదృష్టితో అవి పరిశీలింపబడవచ్చును. నా అభిప్రాయము మీకెంతవరకు నచ్చకుండా ఉంటుందో అంతవరకు నేను మీకు నా అభిప్రాయాన్ని తెలుపుతూనే ఉంటాను. ఎంతవరకు అది మీకు సంపూర్ణముగా అర్థంగాదో అంతవరకు మీరు దానిని ఆమోదించ కూడదు. జరుగవలసిన విధానమిది. ఏది జరిగినా అందరికీ సంపూర్ణ స్వాతంత్ర్యముతో కొనసాగ వలసినదే. అయితే మీరు ఏ కార్యక్రమమును సిద్ధంచేస్తారో అది అందరికీ ఆమోదనీయమైనదిగా ఉండవలెను.

సోదరులారా! ప్రభుత్వ ప్రణాళికపట్ల, వివిధ రాజకీయ పక్షాలపట్ల మన విధానమేవిధముగా ఉండవలెనో ఈ విషయమును పూర్తిగా వివరించినాను.

## 2. భూదానయజ్ఞ ప్రగతి – అందుకు మార్గము

ఇక రెండవ విషయము మన ఉద్యమ నిర్వహణము కార్యవిధానము, ఈ కార్యము తెలంగాణనుండి ప్రారంభించి

సుమారు రెండు సంవత్సరాలైనది. ఇది ఏ గ్రామములో ప్రారంభింపబడిందో ఆ గ్రామము సోదరులు ఈ సమ్మేళనములో ఉన్నారు. మొట్టమొదట దానమిచ్చినదివారే. హరిజనులు 70 ఎకరాలు ఇమ్మని అడిగినారు. కాని వారు ఇచ్చినది 100 ఎకరాలు. వారు స్వయముగా ఇక్కడ ఉన్నారు. వారిని మీరు కలుసుకొని మాట్లాడవచ్చును. వారి ఊళ్ళో ఎటువంటి వాతావరణములో ఈ ఉద్యమము ఆరంభమైందో వారివల్ల మీరు తెలుసుకొనవచ్చును,

భూదానయజ్ఞము - భగవత్ప్రేరితము

ఆనాడు నా హృదయములో దివ్యజ్యోతి ఒక్క వెలుగు వెలిగింది. ఆ వెలుగులో నాకు మార్గము కన్పించింది. ఆ క్షణములో జగద్రక్షకుడైన భగవంతుడు నాకు కర్తవ్యమును ప్రబోధించినాడు. సర్వేశ్వరుడు నాకు కర్తవ్యప్రబోధము సలుపకపోతే నేను నా స్వతంత్ర బుద్ధితో ఆలోచించి ఉన్నట్లయితే భూదానఉద్యమ సిద్ధాంతము నాకు స్ఫురించేదేకాదు. మసీదులకు, దేవాలయాలకు, మఠములకు నూరు, ఇన్నూరు, వేయి ఎకరాలదాకా దానము లభించవచ్చును. కొందరు ఆ విధంగా సేకరించి ఉన్నారుకూడా. మేముకూడ ఆ దేవిధంగా ఏవో పుణ్యస్థలాలకోసము భూమిని సేకరించ దలపెట్టినట్లయితే అదేమంత ఘనకార్యము కాదు. కాని భూమి సమస్యను పరిష్కారము చేయవలెనంటే కొన్ని కోట్లఎకరాలు కావలసి ఉంటుంది. అదీ ప్రజలలోనిసహృదయత్వాన్ని జాగృతముచేసి వారి ఇష్టపూర్వకముగా సేకరించవలసి ఉంటుంది. ఇంతటి

సాహసోపేతమైన మహోద్యమాన్ని ప్రారంభించడము మాత్రం నా మానసిక ఊహకు అతీతమైనట్టిది. అన్నప్రేరణ లభించిన తర్వాత అంతటి గొప్పకార్యము నాకు సాధ్యం కాగలదేనా అన్న అనుమానం కలిగింది. అయితే మరి ఆ హింసకు హింసలొంగి పోవలసిందేనా? అది ముమ్మాటికి జరుగకూడదు. భగవత్ప్రేరిత ఉద్యమముకొనసాగవలసిందే నా ఆత్మ నడుము బిగించింది. కార్యము కఠినమైనదే మార్గం కంటకావృతమైనదే. అయినా సర్వశక్తిమంతుడైన ఆ భగవానుని మీద విశ్వాసముంచి ఉద్యమమును చేబూనవలసిందే నన్న సంకల్పం నాలో దృఢతరమైనది. అప్పటికి మిత్రబృందంలోని వారెవ్వరితోనూ ఈ విషయమునుగూర్చి ప్రస్తావించియుండలేదు. ఒక వేళ చర్చించినను, ఉద్యమము ను ప్రారంభించవలెనని ఎవ్వరూ సలహా ఇచ్చేవారు కారు, ఇది కొనసాగేపనికాదు అని అనేవారు. సందర్భవశాత్తు ఏదో ఒక గ్రామములో ఇట్లా జరిగిందంటే అది వేరు విషయము అన్న అభిప్రాయము వారికి కలిగేది. నాకు అత్యంత సన్నిహితులు అయినట్టివారికి కూడా ఇట్టి అభిప్రాయమే కలిగేది. చివరకు నాకుకూడా అదే అభిప్రాయంకలిగేది. ఈశ్వరప్రేరణ నాకు గాక మరింకెవరికైనా లభించినా వారు నన్ను దానినిగురించి అడిగినప్పుడు "భాయీ! ఒక ఊళ్ళో ఒక సంఘటన జరిగింది అంతమాత్రాన ఆ సంఘటన నాధారముగాగొని దేశమంతటికీ ఒక కార్యక్రమముఏర్పాటుచేస్తామంటే, అది ఎట్లాసాధ్యమవుతుంది? అది సంభవము కాదు" అనే అనేవాడిని. ఎవరికైనా అది ఛప్పున స్ఫురించడం అసంభవం. అందుకే నేను ఎవరి

తోనూ కలహాల సంప్రదింపులు జరపలేదు. అది ప్రయోజనకారి అనికూడా నేననుకోలేదు. అదృష్టమును ఆజమాయింతామని పించింది. అడగడము ప్రారంభించినాను. అడుగుతూ, పోతూఉంటే దానిముందు, వెనుక, పైకి, క్రిందికి ఏమేమి భావాలు దాగి ఉన్నవో, రోజురోజుకు వాటిని గురించి తెలియరాజొచ్చింది. నవప్రభాతములో మార్గదర్శనమును స్పష్టమవుతూ వచ్చింది అప్పటి అనేక వ్యాఖ్యానాలను మీరు చదివితే ఏరోజుకారోజు, ఏదో ఒకక్రొత్తవిషయము అందులో మీకు కనిపిస్తుంది, విషయము వెంటవెంట దానంతటదే స్పష్టమవుతూ వచ్చింది, భూమి లభిస్తూ వచ్చింది. అక్కడికీ మనసులో ఓమూల అనుమానము ఉంటూ వుండేది. అదిస్వాభావికము. నాలో అంతగా లేకున్నా, ఇతరుల మనస్సులో అధికముగా ఉండేది. ఇది తెలంగాణాలో స్ఫురించింది. ఆభూభాగానికి తత్సంబంధ పూర్వరంగ ప్రాధాన్యంఉంది. బహుశా ఇతరప్రాంతాలలో ఇది స్ఫురించి ఉండకపోవచ్చును

## భూదానయజ్ఞ వికాసము

ఒకప్పుడు ఢిల్లీకి వెళ్ళవలసి వచ్చినది. బహుశా పండిత నెహ్రూ ఆహ్వానము మీద అనుకుంటాను. వెంటనే బయలేరి రావలసిందిగా వారు ఆదేశించినారు. అట్లే తత్ క్షణము బయల్దేరడానికి పూనుకున్నాను. అయితే మామూలుగా నా ఎప్పటి పద్ధతిప్రకారము కాలినడక ప్రయాణము సాగించినాను. అప్పుడు దారిపొడవునా ప్రజలకు ఈ విషయమును గురించి తెలుపుతూ నడక సాగించినాను. దాని ఫలితమేము

యింది అంటే తెలంగాణా ప్రజలలో దానిని గురించి ఎంత ఉత్సాహము కనిపించిందో అట్లే ఢిల్లీవరకుకూడా ప్రజలలో అంత ఉత్సాహాసక్తులు కనిపించినవి. దానితో ఒక విషయం స్పష్టమయింది. ఇది కేవలం తెలంగాణాకుమాత్రమే సంబంధించినది కాదనీ, దీనికి కాల ప్రవాహముకూడా అనుకూలముగాఉన్నదనీ స్పష్టంగా తెలిసిపోయింది అంతవరకూ లభించినంత భూమి స్వీకరిస్తూ వెళ్ళినాను.

## ఉత్తర ప్రదేశ్‌లో

ఉత్తరప్రదేశ్ పర్యటించవలసి వచ్చినప్పుడు ఒకకోటా నిర్ణయించుకున్నాను. ఆ మేరకు భూమి సేకరించవలెనని సంకల్పించుకొన్నాను. అదియేమంత ఎక్కువ కాదు, అయినా ఆ సంకల్పమును దృష్టియందుంచుకొని భూమిస్వీకరణ ప్రారంభించినాను. ఉత్తరప్రదేశ్‌లో సహయోగులు స్వల్పసంఖ్యలో ఉన్నా వారు అమిత ధైర్యముతో సంకల్పసిద్ధికి పూనుకున్నారు. 10 నెలలు నిర్విరామముగా అటుఇటు తిరిగినారు. వారిలో కొందరు పనిలో ఎంతో ముందు ముందుండినారు. వారి సహాయముతో కార్యసాఫల్యం సుసాధ్యం కాగలదను నమ్మకము కలిగింది. చాలావరకు సంకల్పం పూర్తికావచ్చినదని వారు ఇవ్వాళ సమ్మేళనములో ప్రకటించినారు. 5 లక్షల ఎకరాలు వసూలు కావలసియుండెను. ఇంతవరకు 4 లక్షల 75 వేల ఎకరాలు వసూలయినవట. 25 వేల ఎకరాలు కొన్నాళ్లలో వారు వసూలు చేయగలరు. అంతేగాక వచ్చే సంవత్సరంలో మొత్తం 11 లక్షల ఎకరాలు సేకరించవలెనని కూడా

వారు నిశ్చయించుకున్నారు. ఆ విషయమును కూడా వారు ఇక్కడ ప్రకటించి యున్నారు. అంతా ఒకచోటకూడి భగవన్నామ సంస్మరణతో కార్యసాఫల్యమునకై నిర్విరామ కృషి సలుపగలమని ప్రతిజ్ఞచేసినారు.

## ఉద్యమవ్యాప్తి

ఉత్తరప్రదేశ్ లో ఈ విధముగా జరిగింది. ఇట్లే దేశమంతా తిరుగుతూఉంటే, సంవత్సరానికి రెండుమూడులక్షల ఎకరాలభూమి లభించగలదని విశ్వాసం కలిగింది. భారత దేశము మొత్తం తిరిగేవరకు అయిదారు సంవత్సరాలైనా ఈ లోగా 10, 20 లక్షల ఎకరాల భూమిని సేకరించవచ్చును. కాని అంతటితో సమస్య పరిష్కారము కాదు. ఒక నిర్ణీత కాలపరిమితిలో ఆ సమస్యను మనము పరిష్కరించ లేనిచో పరిణామాలు దురూహ్యంగా ఉండవచ్చును. కాల గమనం పూర్వంవలె లేదు. స్థితిగతులు నానాటికి తీవ్ర రూపమును దాలుస్తున్నవి. ఇటువంటి కార్యక్రమము ఒక శతాబ్దమువరకు కొనసాగించవలెనంటే అది సరియైన పద్ధతి కాదు. ఉద్యమము ప్రజోపయోగ సాధనము కాగలదు. కాని సమాజ నిర్మాణ సాధనము మాత్రము కాజాలదు. కాబట్టిఎట్లయినా సత్వర సమస్యా పరిష్కారము మాత్రము చేయవలసిందే. అందుకు ఒకమార్గమును అనుసరించడము అవసరము.

## బుద్ధ భూమి – బిహార్

బుద్ధ భగవానుని విహారభూమి బిహార్ అంత పెద్దదీ కాదు, అంత చిన్నదీ కాదు. అక్కడ సౌజన్య సద్భావాలు

మిగతా ప్రాంతాలకన్నా భిన్నగా ఉంటవి. కాని తక్కువ మాత్రము ఉండదని నాకు తోచింది. బిహార్ భూభాగములో మొట్టమొదట అడుగు పెట్టగానే నా ఈ అభిప్రాయమును ప్రకటించినానుకూడా. కాని అనుకున్న దొకటయితే అనుభవములోకి వచ్చింది ఇంకొకటి. ఇక్కడ కృషి ఎక్కువగానే చేయవలసి ఉంటుందని తరువాత తోచింది. పవిత్ర జలము కోసము నేల త్రవ్వుతూఉంటే ముందు బండ పడవచ్చును. కాని బండనుకూడా బ్రద్దలుకొడితే అడుగున స్వచ్ఛమైన ఉదకము ఊరుతుంది. బండను బ్రద్దలుకొట్టడము శ్రమతో జరిగే పనే. అయినా అందువల్లపవిత్రమైన జలము లభించడమే ఫలితము. కాబట్టి సఫలితాన్ని సాధించడానికి శ్రమ ఎంతైనా సరే. ఎక్కువ కష్టపడటము వలన ఈ ప్రాంతమంతా మన పని నిర్మలముగా కొనసాగుతుంది. "అస్తీత్యేన ఉపలబ్ధవ్య" అని ఉపనిషత్ప్రబోధము. "అస్తి" అవుతుంది. అనవలె కాని "నాస్తి" కాదు. అని అనకూడదు. "లేదు" "కాదు" అనే నాస్తిక పరిభాషలో ఎప్పుడూ మాట్లాడకూడదు. మనస్సులో సంకల్పమైతే చేసుకున్నాము; కాని సంకల్పము పూర్తిగావడము కష్టసాధ్యముగా వుంది. మరి ఎట్లాఅన్న భావము నా మనస్సులోకి ఎప్పుడూ రాలేదు. రెండు నెలలు గడచినవి. దానము ఏమంత ఎక్కువగా లభించలేదు. బిహార్‌లో ఇక లాభము లేదని అనడముకూడా ఆరంభమైనది. చివరి రోజులలో ఉత్తర ప్రదేశులో దానము అధికముగా లభించింది. తర్వాత బిహార్‌లోకూడా అట్లే లభించుతూ వుండగలదని అనుకోవడము జరిగింది. ఉద్యమము ఇంకా త్వరితగతిని సాగ

గలదనికూడా ఆశింపబడింది. కాని అట్లా జరుగలేదు. సారన్ జిల్లాలో, అధ్యక్షులు బాబూ [illegible] ము. భారతదేశ ప్రజాస్వామిక ప్రభుత్వాధ్యక్షులు బాబూ రాజేంద్ర ప్రసాద్ స్వయముగా తమ హస్తాక్షరితో ఒక విజ్ఞాపన జారీచేసినారు. బిహార్‌లో ముఖ్యంగా సారన్ జిల్లాలో భూదాన ఉద్యమానికి అధికాధిక ఆదరసహకారాలు లభించవలెనని వారు తమ విజ్ఞాపనలో వ్రాసినారు. ఆ విజ్ఞాపన పత్రానికి అనేక ప్రతులు తీయబడినవి. ప్రజలలో విరివిగా పంచిపెట్ట బడినవి. ఇదంతా చేసినా అక్కడ మాకు పదిహేను రోజులలో అతికష్టముగా వెయ్యెకరాల భూమి లభించింది. ప్రయత్నము చేయగా చేయగా రోజుకు ఎకరము, రెండెకరాల భూమి లభించడమే ఘనమైపోయిన సమయముకూడ అనుభవములోకి వచ్చింది. రెండు, మూడెకరాల భూమి లభించిననాడు నేను కార్యకర్తలను చీవాట్లుపెట్టేది. వారికి పౌరుషంవచ్చి ఉద్యమాన్ని మరింత వేగంచేసేవారు. ఆరంభములో ఇటువంటి అనేక అనుభవాలు కలిగినవి. ఈ విధమైన నిత్య నూతనానుభవాలతో గయ జిల్లాలో అడుగు పెట్టినాను. నేను మొట్ట మొదట ప్రవేశించినది గయ జిల్లాకు చెందిన ఒక చిన్న పల్లె టూరు. సాధారణముగా నాకెప్పుడూ కనులుమూయగానే నిద్రాదేవి సాక్షాత్కరిస్తుంది. కాని ఆ రాత్రిపూట నిద్ర తొందరగా తేలిపోయింది. ఆలోచించడం ప్రారంభించాను. భగవాన్ బుద్ధుడు తపస్సుచేసిన గడ్డయిది. భారతావని మొత్తంనుండి కోట్లాది హిందువులు శ్రాద్ధకర్మలు చేయడానికి అత్యంత శ్రద్ధాళువులై వచ్చే పవిత్ర స్థలమిది. శాస్త్రమనగా

శ్రద్ధకు నెలవు అని యర్థము. హిందూధర్మానికి అత్యంత శ్రద్ధాసక్తులుగల భూభాగమేగాక, గయ బౌద్ధధర్మానికి పుట్టి నిల్లు. ఇది బౌద్ధధర్మాగమన స్థానమగుట సామాన్య విషయముకాదు. మొట్టమొదటిక్షిస్తుగా ఇక్కడ ఒక లక్ష ఎక రాలు సేకరింప బడవలెనను సంకల్పము కలిగినది. ఉదయము కాగానే లేచి వెంటఉన్న ఇద్దరుముగ్గురు సోదరులతో కలసి బయల్దేరినాను. అంతాకలిసి గ్రామములోకి వెళ్ళి గ్రామ వాసులకు మా ఈ సంకల్పాన్ని తెలిపినాము. అందుకు వారంతా సరేనన్నారు. ఇంతవరకైనపని అందరికి తెలిసే ఉండెను. నాలుగు లక్షల ఎకరాల కోటా సిద్ధం చేయబడింది. అక్కడి కాంగ్రెసువారు సంకల్పసిద్ధికి పూనుకున్నారు. దానిపై నకూడా విమర్శ బయల్దేరుతుంది. "భూదానం ఎటు!" అని ప్రజలు ప్రశ్నిస్తారు. ఉద్యమము కాంగ్రెసువారి హస్తగత మైపోయిన దంటే అది "బద్మాషు"ల చేతులలో పడిపోయిందని అను కొంటే ఎట్లా? ఈ విధంగా ఇతరుల విషయము అనుకొంటే మనం అహింసను సరిగా అర్థం చేసుకొన లేదన్నమాట. ఇట్లా భావించడం కేవలం మన దుర్బలత్వము. ఎవ్వడు మన చేయిపట్టినా, వాడిని లోబరచుకొన గలిగినంత శక్తి మనలో ఉండవలెను.

## వ్యూహ నిర్మాణం

బిహారులో చాలా ఎక్కువ కృషి చేయవలసి ఉంది చేసే ప్రయత్నముకూడా ఒక ప్రత్యేక పద్ధతిలో చేయవలసి ఉంది. దానిని నేను వ్యూహరచన అని యంటాను. ప్రత్యే

కించి ఓ రెండు, మూడు జిల్లాలలో విశేషకృషి సలువవలెను. తత్ఫలితముగా ఆ జిల్లాలలో భూమిసమస్యలన్నీ పరిష్కృత మైపోవలెను. జయప్రకాశ్ జీ అన్నట్లు గయా లేదా ఇంకే దైనా జిల్లాలో మూడు లక్షల ఎకరాలభూమి లభించి, వినా శాసనం భూవిభజన జరిగితే అందుకు అదనంగా ప్రభుత్వ సహాయము దొరుకుతుంది. భూ విభజనకు శాసనవిరహిత మార్గం సుగమ మైపోయినతర్వాత ప్రభుత్వము తప్పనిసరిగా అందుకు తోడ్పడవలసి ఉంటుంది. ప్రభుత్వ యాజమాన్యాన ఉన్న భూమినికూడా తీసుకొనవలసి ఉంటుందప్పుడు. రెండు లక్షల ఎకరాలభూమి ప్రసక్తి వచ్చినచోట ప్రభుత్వ భూము లయితే నేమి, ఇంకే భూము లయితే నేమి? ఒక ప్రాంతము యావత్తుకూ సంబంధించిన భూమిసమస్యను పరిష్కరించు టకు ఆ ప్రాంతములో ఉన్న భూమి మొత్తము కావలసి ఉంటుంది కదా! అప్పుడు ఆయా ప్రాంతాలలో 32 లక్షలు, 40 లక్షలు, ఒకకోటి ఎకరాలు ఇట్లా అవసరాన్నిబట్టి భూమి కావలసిఉంటుంది. ప్రభుత్వభూములు తీసుకొనకతప్పదు. కాని ఇప్పుడు కాదు. సర్కారుభూముల స్వీకరణ ఆరంభంలో జరుగ వలసింది కాదు. ఆపైన జరుగవలసిన పని అది. అయినా సర్కారువారి సహాయం మట్టుకు ఈ కార్యంలో తప్పక ఉండి తీరుతుంది. అంతా కలిసికట్టుగా కృషిచేస్తే ఒకజిల్లాలో భూమి సమస్య పరిష్కార మైపోతుంది. ఒక జిల్లాలో సాధ్యము, కాగ లిగినది మిగతా దేశములో ఎందుకు సాధ్యము కాగూడదు? ఒక ప్రాంతం ఆదర్శప్రాయంగా తయారవుతే, తత్ప్రభావము యావద్దేశముపైనను పడుతుంది. ఇటువంటి ఆదర్శ ప్రాయ

మైన ప్రాంతమొకటి తయారు కావలెను. ఇదే నా దృక్పథము. నేనెప్పుడూ ఇటువంటి ఆదర్శప్రాంతమొకటి తయారు కావాలని కోరుతూనే ఉన్నాను. పరిణామతః దేశమంతటా భక్తిశ్రద్ధలు పెరుగుతవి. ఈ పని కానవ సహాయము, దండశక్తి—ఇవేవీ లేకున్ననూ నెరవేరగలదని అందరికీ విశ్వాసము కలుగుతుంది.

"సర్వధర్మాన్ పరిత్యజ్య

"మామేకం శరణం వ్రజ

ఒక్కసారి దృఢమైన సమ్మకము కలిగితే, కార్యకర్తలందరూ కార్యసాధనలో నిమగ్నులై పోతారు. ఒక్కుమ్మడిగా అంతాకలిసి పూనుకుంటే సమస్యా పరిష్కారానికి ఆలస్యం జరుగదు. ఇది నేను ఆలోచించినది. మీరంతా మీ మీ ప్రాంతాలకు వెళ్ళి ఈ కార్యసాధనకుగాను మీ సమయమును పూర్తిగా ఒక్క సంవత్సరముకొరకు వినియోగించ వలెనని నేను మిమ్ముల్ని కోరుతున్నాను. కార్యేతరముల నన్నింటినీ వర్జించి ఇందుకై మీ సమయమును వినియోగం చేయండి. ఈ పని పూర్తి యగువరకు— ఒక సంవత్సరమువరకు— ఇతర పనులను వదలుకొమ్మని నేను మిమ్ముల్ని కోరుతున్నాను. ఇట్టి త్యాగమును నేను మీకు క్రొత్తగా ప్రబోధించడము లేదు. భక్తిమార్గములో అధర్మము నైతే త్యజించ వలసిందే కదా; అంతేకాదు ధర్మమును సహితం త్యజించవలసి ఉంటుంది. "సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణంవ్రజ" సర్వ ధర్మములనూ పరిత్యజించి నన్నాశ్రయించుము! అనికదా శ్రీకృష్ణ

భగవానుని ఆదేశము. గీత ప్రబోధిస్తూ ఉన్న భక్తి మార్గమిది భక్తి మార్గమునుగురించి విచారిస్తున్నప్పుడు చిన్న చిన్న ధర్మ ములనుగురించి సందేహాలు పెట్టుకొంటే మనము నైష్ఠికులము కాజాలము. మహదాశయమును వదలుకొని చిన్న చిన్న విషయ వ్యాసంగాలలో పడిపోతే భక్తి సఫలమయేదెట్లా? సర్వ ధర్మములను పరిత్యజించడమే భక్తి మార్గ విశిష్టత. మన మనుగమిస్తున్నది భక్తి మార్గము. మన ఆశయము నవ సమాజ నిర్మాణము. ఇంతటి బృహదాశయము భక్తి ద్వారాగాక మరే విధముగా సాధ్యమవుతుంది? సమాజమునంతనూ ప్రేమమయం చేయదలచిన యెడల, అదే మన ముఖ్యధర్మ మయిన యెడల, మన మిదివరకే స్వీకరించియున్న అనేక ధర్మములను భక్తి కొరకై పరిత్యజించవలసి ఉంటుంది. మీరు మీ కార్యముల నన్నిటినీ పరిత్యజించి ఏకైక కార్యసాధనకు పూనుకొన వలెనని నా కోరిక.

## అన్యప్రాంతాలవారికి ఆహ్వానము

రెండో విషయము మీమీ ప్రాంతాలలో పనిచేస్తున్న వారు చేస్తూవుంటారు. కాగా అన్య ప్రాంతాలవారు బీహారుకు వచ్చి ఓ రెండుమూడు నెలలు ఉండి పని చేయుట మంచిది, చాలా అవసరముకూడాను. అందువల్ల రెండు ప్రయోజనములున్నవి. ఈనాడు బిహార్‌లో పరస్పరదూషణ ప్రపూరిత వాతావరణమున్నది. ఇక్కడ పక్షవిభేదాలు, కక్షలు మెండుగా కనిపిస్తున్నవి. అవి సమసిపోవడానికి నేను కృషిచేస్తున్నాను. అయినా అవి భగవదనుగ్రహంవల్ల తప్ప మరొక విధముగా

నమసిపోయేవిగాలేవు. అంత గాఢంగా పాతుకొని ఉన్నవి. మౌలికకారణము మరేమీలేదు. కేవలం అది పసిపిల్లల పోట్లాటగా తోస్తుంది. ఆలోచనా సంబంధమైన విభేదాలేమైనా ఉన్నవా అంటే అదీలేదు. ఆశయాలకు సంబంధించిన అభిప్రాయ విభేదాలేమైన గలవా, అంటే అదీలేదు. అసలు కారణము ఆ భగవంతుడే ఎరుగు; ఏమైనా ఆ విభేదాలుమాత్రము విషమదశలో ఉన్నవి. అన్యప్రాంతాలవారిని బీహారు కు నే నాహ్వానిస్తున్న దెందుకంటే వారు ఈ కక్షలకు దూరముగానూ తటస్థంగానూ ఉంటారు. ఈ వైషమ్యాలను అంత మొందించడములో వారు బాగా తోడ్పడుతారు. వచ్చేవారికి ఇక్కడ మంచి శిక్షణ లభిస్తుంది. ఇక్కడ ఉన్నట్టి వాతావరణములో ఏ రీతిగా పని చేయవలెనో వారికి బాగా అవగాహన అవుతుంది. తిరిగి తమ ప్రాంతాలకు వెళ్ళిపోయిన పిదప వారికి ఇక్కడ లభించిన శిక్షణ, అనుభవము ఉపయోగపడగలవు. తమ ప్రాంతాలలో పని వదలిపెట్టి ఇక్కడికి రావాలని నేను కోరుటలేదు. ఒక్కొక్క ప్రాంతానికి చెందిన నలుగురైదుగురు చిన్న కార్యకర్తలు వివిధ ప్రాంతాలనుండి ఇక్కడికి రావడము అన్నివిధాలా మంచిది. ఇది నా రెండవ కోరిక.

## బీహారీ వాసులతో

మూడవ కోరిక బీహార్ వాసులను కోరుకొంటున్నాను. వారు ఒకటి రెండు జిల్లాలలో తమ యావచ్ఛక్తిని వినియోగించవలెను. ఆ పైన మిగతా జిల్లాలలో ప్రయత్నించవచ్చును. వారు ఈ విధముగాచేసి రెండు మూడు మాసాలలో

ఒకటి, అరజిల్లాను పూర్తిచేస్తే సంతసిస్తాను. "మీరు బీహారులో చిక్కుకొని ఉండే ఇతర ప్రాంతాలకు రాకపోతే అందువల్ల భూదానమునకు ఎంతవరకు పుష్టి లభించగల" దని ప్రజలు నన్నడుగుతుంటారు. ఇటువంటి వ్యూహప్రవేశ మెంత వరకు సమంజసమన్నది వారి ప్రశ్న. అవును అది సమంజసము సముచితమనే వారి ప్రశ్నకు నా సమాధానము. ఒక నిర్ణీత సమయములో కొంత పని నెరవేరడమే తత్ఫలితము. ఒక ప్రాంతమును ఎన్నుకొని పూనికతో అక్కడ మన కార్యక్రమమును నిర్వర్తించినందువల్ల ఆ ప్రాంతము పని పూర్తి అవుతుందికదా! ఇట్లే ఇంకా ఇతర ప్రాంతాలలోనూ. ఎందరు కార్యకర్తలద్వారా ఇంత పని సాధ్యమయింది? దేశమంతటా ఈ పని కొనసాగడానికి ఎంతమంది కార్యకర్తలు, ఎంత సమయము అవసరం? ఇది కేవలము గణితానికి సంబంధించిన ప్రశ్న. కార్యకర్తలులభిస్తే పని పూర్తవుతుంది. ఈ విధముగా ఒక ప్రాంతములో ప్రాయోగికముగా కార్యనిర్వహణకు పూనుకున్నయెడల, అవసరముకాగల శక్తిసామర్థ్యాల గురించిన విస్పష్ట స్వరూపము మనకు గోచరిస్తుంది. అటువంటి విస్పష్టమైన స్వరూపం మన ముందు ఉండవలెనని నేను వాంఛిస్తున్నాను. అంతేగాక అత్యంత ఆవశ్యకమనికూడా నా అభిప్రాయం. ఇక్కడ ఎంత వరకు పని పూర్తికాదో అంతవరకు నేనిక్కడినుండి కదిలేది లేదని నేను బీహార్ వాసులకు చెప్పివేసినాను. వచ్చే సమ్మేళనము ఈ ప్రాంతములోకాక మరింకెక్కడైనా జరుగవలెనని నేను కోరుతున్నాను. ఈ రోజుల్లో నేను దేశాటన

చేస్తూ సమ్మేళనం సమయంవరకు ఎక్కడఉంటాన్ో అక్కడే సమ్మేళనం జరుపడం ఆచారమైపోయింది. ఈ ప్రాంతంవారు ఈ లోపుగా ఇక్కడిపని త్వరగాముగించేసి నన్ను సమ్మేళనం సమయం సమీపించేవరకు మరోచోటికి పంపివేయగలరని నేను విశ్వసిస్తున్నాను. అంతాకలిసి ఒక్కసంవత్సరములో 32 లక్షల ఎకరాలభూమి సేకరణకై మనం పెట్టుకొన్న ప్రతిజ్ఞను పూర్తి చేయడానికి పురోగమింతాం.

## దేశమంతటా బీహార్ ప్రభావం

ఆగామి సంవత్సరంవరకు 25 లక్షల ఎకరాల సేకరణకై మనం సంకల్పం చేసుకొన్నది సర్వవిదితమే. ఒక్క బీహార్లోనే ఒకవేళ 32 లక్షల ఎకరాలభూమి సేకరించ గలిగితే మన సంకల్పానికి ఇక కొరత ఉండబోదు. ఈ ప్రయత్నమే గనుక ఫలప్రదమైతే చూస్తు చూస్తుండగనే ఇతర ప్రాంతాలలో గొప్పవిప్లవం వచ్చేస్తుంది; అటుతర్వాత ఎక్కువ కృషి చేయ వలసిన అవసరం ఉండదు. ఒక్క బీహార్లో " మీరు కోరినంతభూమిలభించి మిగతా ప్రాంతాలలో ఏమాత్రంగూడా భూమిలభించకపోతే ఎట్లా?" అని ఒక సోదరుడు ప్రన్నోపసారి ప్రశ్నించినాడు. మీరు వేసిన ప్రశ్న మానసికశాస్త్రానికి విరుద్ధంగా ఉందని నేనాయనతో అన్నాను. మానసికంగా ఇటువంటి పరిణామం ఏర్పడటం సంభవమే కాదు. అయినా మాట వరుసకు మిగతా ప్రాంతాలలో ఎక్కడా ఏమీ దొరకదనే అనుకుందాం. కాస్సేపటికి ఈ విధంగా ఆలోచించి చూచినా అందువల్ల రెండుమూడు పరిణామాలు ఏర్పడటం

మట్టుకు తప్పదు. ఆయా ప్రాంతాల ప్రభుత్వాలు బీహార్‌లో భూమి సమస్య పరిష్కరింప బడుతూ ఉండటం గమనించి తదనుగుణ్యంగా శాసనం చేయగలవు లేదా ప్రజలు తిరుగుబాటుకు సన్నద్ధులవుతారు. అటు బీహార్లో జరిగింది, ఇక్కడ మా ప్రాంతంలో ఎందుకు జరుగకూడదు? అని వారు అంతతము ప్రభుత్వాలను నిలదీసి అడుగుతారు. ప్రభుత్వాలు మెలకువతో మెలిగితే సరేసరి; లేకపోతే ప్రజలు తిరుగుబాటు చేస్తారు. అయితే శాసనరూపేణా రాజ్యక్రాంతి లేదా ప్రజాశక్తి రూపేణా తిరుగుబాటు ఈ రెంటిలో ఏదో ఒక పరిణామం ఏర్పడుట తప్పనిసరి. ఒకచోట ఇంతటి అమోఘమైన సంఘటన జరిగితే పరిసర ప్రాంతాలలో దాని ప్రభావం ఏమాత్రం పడకుండా ఉండుట కేవలం అస్వాభావికం. అట్లా ఎన్నడూ జరుగదు. మానవసమాజం అంతా చిన్నాభిన్నమై పోయిన స్థితిలో లేదు. ఒకచోటి అనుభూతి మరొకచోట తప్పక పడుతుంది సమవేదనాత్మకత భావం లోకంలో బాగానే ఉంది. భారత దేశంలోనూ ఉంది. విదేశాలలోనూ ఉంది.

ఇంత దనుక మీకు నేను ఆలోచించిన వ్యూహాన్ని గురించి తెలిపినాను. నావాంఛ లేమిటో అవికూడ మీకు విన్నవించి ఉన్నాను.

చాందిక్, 9 మార్చి 1953

# ఆత్మపరీక్ష

గడచిన సంవత్సరములో మనమేమి పని చేసినామని ఆయా ప్రాంతాలవారి నందరినీ అడిగి తెలుసుకొన్నాను. వారందరితోనూ ఆ విషయమై చర్చించినాము. చర్చల సందర్భములో కార్యకర్తలను జాగరూకులను చేయుడానికి అప్పుడప్పుడు కొంచెం తీవ్రంగా మందలించవలసివచ్చింది కూడా. వారు ప్రేమపూర్వకముగా వాటన్నిటినీ భరించుకొన్నారు. ఎవరికైనా నా మాటలవల్ల బాధకలిగివుంటే వారందరితోనూ నేనిప్పుడు క్షమాపణలు వేడుకొంటున్నాను. గత సంవత్సరం మనం చేసినపని బాగానే జరిగింది. అయినా మన వ్యవస్థ సరియైన పద్ధతిలో నిర్వహింపబడి ఉన్నట్లయితే ఇంకా బాగా కొనసాగేది. నిన్న చదువబడిన తీర్మానం ప్రకారం గత సంవత్సరం ఏడెనిమిదిలక్షల ఎకరాలు సేకరింపబడినట్లు తెలుసుకున్నాం. ఆ విషయం తీర్మానంలో గౌరవపూర్వకంగా ఉల్లేఖింపబడిఉంది. సేకరణలో తోడ్పడినవారికందరికీ అదినిజంగా గౌరవపూర్వకమైనదే.

వచ్చేసంవత్సరం ఇంకా కొంచెం ముందుకు పోదలచుకున్నాము. ఎంతవరకు నిర్ణయం చేసుకొంటే అంతవరకు పూర్తి చేయవలసిందే. అది ఏమంత కఠినమైన కార్యంగాదు. ఈ యేడు మొత్తం 11 నెలలే మనం పనిచేయుడానికి లభించి

నవి. వచ్చేపడు 15 నెలలు ఉండగలవు. ఇప్పుడు ప్రణాళిక కూడా బాగా నేకుదిరింది. ప్రజలుకూడా జాగరూకులై నారు. అనుకొన్నంత మేరకు కార్యసాధన తప్పకుండా సాధ్యం కాగల దని నాకు సంపూర్ణవిశ్వాసం ఉంది. ఆశయం చాలాగొప్పది. ఆ దృష్ట్యా ఆత్మవిమర్శ చేసుకొంటూ అందుకు యోగ్యులు కాగలుగుట ఎంతైనా అవసరం. మనలోని లోపాలను గ్రహించి తన్నివారణకు పాటుపడుట అత్యంతావశ్యకము. సమాజములో ఉన్న దోషాలను అధర్మాలను ఎత్తి చూపి నప్పుడు మనం మన స్వీయాధిక్యతను జతలాయించడము తగదు. ఇతరుల లోపాలతో పోల్చుకొని మన ఎక్కువ తక్కువలను నిర్ణయించుకొనడము సరియైన పద్ధతికాదు. మన మట్లా చేయకూడదు. స్వతంత్రంగా మనం ఆత్మపరిశీలన చేసు కొని మనలో గల దోషాలను తెలిసికొనవలెను. ఇతరులలో ఉన్న లోపాలు మనలోపలకూడా పెట్టుకొని వారిని విమర్శిం చుటవల్ల ఫలితం? అట్టి విమర్శలఫలిత మెప్పుడూ శూన్యమే. "మీలోమాత్రం ఈ లోపాలు లేవా?" అని వారు ఎదురడిగి నప్పుడు మన మేముఖంతో వారికి సమాధానం చెప్పగలము? లోపాలోపాలను సరిపోల్చుకొనుట కాక స్వతంత్రంగా ఎవ రికివారే ఆత్మపరీక్ష చేసుకొనుట అవసరము.

## పరస్పర సహాయావశ్యకత

నిన్నటి సమావేశంలో ఒక సంఘటన జరిగింది. ఒక బెంగాలీ సోదరుడు వంగభాషా సంబంధమైన ప్రశ్న నొక దానిని లేవదీసినాడు; వారు కొంచెం ఆవేశ పూరితులై

మాట్లాడినారు. బంగాళా సభికులు వారి ఆవేశాన్ని భరించలేక పోయినారు. "కూచో, కూచో" అను కేకలు చెలరేగినవి. డా. చె. ఓపికతో వారు చెప్పినదాన్ని వినియుంటే సభికుల పైన వారికి ఆదరాభిమానాలు కలిగేవి; ఒక గౌరవభావం ఏర్పడేది. సభికులు వారి హృదయాన్ని చూరగొన్నవారు కాగలిగేవారు వారు తమ ప్రసంగానంతరంలోనే అన్నారు. "ఈ సభలోగా నా భావాలను ప్రకటించుటకు అవకాశం దొరికినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను, అందుకు నే నందరికీ కృతజ్ఞుణ్ణి" అని. ఈ సభ ఉద్దేశాలు వేరుఅని వారను కొన్నారు. అనేక విషయాలు ఇక్కడ చర్చింపబడుతున్నప్పుడు తమ స్థానిక సమస్య నంగీకరించికూడా ప్రస్తావించడం ఎందుకైనా మంచిదే అని వారభిప్రాయపడి ఉండాలి. తరువాత అది వారు అంగీకరించినారుకూడా. వారి ప్రసంగాన్ని ఓపికతో వినియుంటే ఒక మానవహృదయాన్ని చూడగలిగి ఉండేవాళ్ళముకదా! కాని సభ అడ్డంతిరిగింది. వారు పాపం! నొచ్చుకొన్నారు. మాట్లాడే అవకాశం దొరికిందనుకోండి. అయినా ఆయన మనసుకు కలిగిన బాధమాత్రం పోలేదు. విరుచుట సులభమే. అతికించుట అంత సులభంకాదు ఆ అసహన ప్రదర్శనంకూడా సామూహికంగా జరిగింది. ఒక వ్యక్తి మరొకవ్యక్తిని ఆక్షేపించి అవరోధించినట్లయితే అది వ్యక్తిగతమైపోతుంది. కాని ఇక్కడ అది సాముదాయిక స్వరూపం దాల్చింది. మొదటిది అంత దుఃఖదాయకం కాక పోవచ్చు, కాని తర్వాతది అధికంగా నొప్పించునట్టిది. అదే క్షణికమైన విషయం అయివుంటే దానిని నేనంతగా పాటించి

ఉండేవాడిని కాను, కాని అది మనసులో బాగాపాతుకుపోయి ఉన్న దుర్గుణాలలో ఒకటి. దానినే నేను "అసహిష్ణుత" అని అంటాను — మన వాళ్ళకి దీర్ఘరోగంగా పట్టినవేను ఇది. ఇందులో ఆ అసహిష్ణుతకన్నా ఎక్కువదోషం ఉంది.

## వినమ్రత

ఒకవిధంగా మనం ధర్మాత్ములము అనే భావము మనలో ఉంది. సర్వోదయభావాలు మనవి. సర్వోదయ సేవకులము. మన లేఖలపైన సర్వోదయసేవక క్రమసంఖ్యను కూడా మనం వేసుకొంటూము. ఈ మధ్య ఒక మిత్రుని లేఖ ఒకటి చేరింది. లేఖపైన "సర్వోదయ క్రమసంఖ్య" క్రింద "సర్వోదయ సేవకుడు" అని వ్రాసిఉంది. ఇది అంతదోషం కాకపోవచ్చును. కాని నేను అనుభవాలవల్ల తెలుసుకొన్న దేమిటంటే "సర్వోదయ సేవకుల" మైన మనం సర్వోదయ భావాలు కలిగిఉండి, ఆసిద్ధాంతాలమీద విశ్వాసము ఉన్నంత మాత్రాననే వాటిని ఆచరణలోపెట్టినా పెట్టకున్నా — గొప్ప పుణ్యంకార్యం చేసినవాళ్ళమైనామనీ, ఇందువల్ల మనస్థాయి పెరిగిపోయిందని, అనుకొంటూము. ఇది నేను ఎన్నోసార్లు ప్రత్యక్షంగా గమనించినాను. ఈ విధంగా మనం ఆత్మవంచన చేసుకొంటే అది మనకే గొప్ప హానికరం కాగలదు. మనమెప్పుడూ నమ్రతను పెంచుకొంటూ పోవలెను. ప్రపంచానికి మనం సేవకులం, ప్రపంచం మనకు సేవ్యం. అధికృత భావం మనలో ఎప్పుడూ కలుగకూడదు. సేవకభావం అంటే నమ్రభావం. అట్లాకాక స్వామ్యాధికృతభావం మనకు కలిగితే

చరిత్ర పునశ్చరణ జరుగుతుంది. కేవలం మనమే ఉన్నత భావాలుగలవాళ్ళం అన్న అహంభావం వస్తే పరిణామం పూర్వం బ్రాహ్మణులకు వలెనే ఏర్పడుతుంది. పూర్వము బ్రాహ్మణులు జ్ఞానాధిక్యతలే, కాని ఆధిక్యతాభావం వారిలో కలుగడంవల్ల వచ్చిన పరిణామమేమిటో మనకు తెలుసు. చివరకు మనపనీ అంతేగావచ్చు. ఇది గొప్పదోషం. ఆత్మ సంశోధనద్వారా మనలోని ఈ లోపాన్ని దూరం చేసుకొనడం ఎంతైనా అవసరం. రాను రాను మన మెతన్య వి[illegible]ముల మగుటకు ప్రయత్నించవలెను.

## విచారాధ్యయనము – చింతనము

ఇంకా అనేకలోపాలు మనలో ఉన్నవి. వాటిని దోషాలని అనను లోపాలనే అంటాను. మనం కేవలం బహిర్దృష్టితో ఆలోచిస్తాము. విషయాన్ని లోతుగా తరిచి విచారించము. నా ఈ ఆక్షేపణ నేటిదికాదు, కొన్ని ఏండ్ల నుండిగా నేను చేస్తూ వస్తున్నదే. మన కార్యకర్తలు కార్యరంగంలో అహర్నిశలు ఉండేవారుకూడా. విచారసరణులను అధ్యయనం చేయరు. నేను శాస్త్రీయ అధ్యయనమును గురించి చెప్పుట లేదు. మనం చేసేపనికి వెనుక కొన్ని మూలసిద్ధాంతాలు, భావాలు ఉంటవి. అవి బాగా లోతుకుపోతేగాని అర్థంకావు. ఆయా సిద్ధాంతాలను భావాలను మనం విపులంగా విచారించకపోతే జరిగే పరిణామం స్ఫూర్తి క్షయమే. దిన దినం స్ఫూర్తి జీర్ణమైపోతుంది. కాని కార్యకర్తలదృష్టి ఈ వైపుకు పోనేలేదు. గాంధీగారు ఉన్నప్పుడు కూడా ఇంతేజరిగింది.

నేనొకసారి ఒక కార్యకర్త నడిగాను. భాయీ! గాంధీగారీ మధ్య ఒక లేఖ వ్రాసినారు అది మీరు చదివినారా అని. లేదు, చదువ లేదని సమాధానం చెప్పినారాయన. చదివి తీర వలసిన లేఖ అది అని నేనన్నాను. ఆయన అన్నారు: కావచ్చు. గాంధీజీ వ్రాసినది నిస్సంశయంగా చదువవలసినదే అయి ఉంటుంది. కాని మేము వారి ఆదేశానుసారం కార్య నిమగ్నులమై ఉన్నాము. వారు ఆదేశించిన పనికన్నా వారు వ్రాసే దాని సార మింకేముంటుంది? పనివల్ల తీరికలేకుండా ఉన్నది. వ్రాసినవన్నీ చదువాలంటే పని కొంత తగ్గించు కొన వలసి ఉంటుంది" నేనన్నాను. "కార్యకర్తలకు చదువవలసి అవసరం లేనప్పుడు గాంధీగారికి వ్రాయవలసిన అవసరమేమిటి? వారూ కర్మపరాయణులే అయినా ప్రతివారం ఎప్పుడో ఒకప్పుడు తీరిక చేసుకొని ఏదో ఒకటి వ్రాస్తూనే ఉంటారు. అయితే వారు వ్రాసే లేఖలద్వారా నూతనప్రకాశము మనకు లభిస్తూ వుంటుందని మనం తెలుసుకొనవలసి ఉంది. కొందరు గాంధీగారు వ్రాసిన మాటలనే అప్పుడప్పుడు వాదోపవాదాలలో ఎత్తిచూపేవారు. చాలామంది "చదువడమెక్కువ పనిచేసేది తక్కువ" అని గాంధీగారు ఒకటి రెండుసార్లు అన్నారుకూడా. కాని అది కేవలం చదివి ఊరకకూచునే వారినిగురించి అన్న మాట. చదువడమేకాని చదివినదానిలో ఆవంతైనా ఆచర ణలో పెట్టక శుష్క వాగ్వివాదాలతో కాలం వెళ్ళబుచ్చే వారిని మందలించే ఉద్దేశంతో గాంధీగారు ఆమాటఅన్నారు. వ్యర్థ చింతనవల్ల ప్రయోజనమేమాత్రము లేదని వారి అభిప్రా యము. కానికార్యనిమగ్నులై ఉన్న కార్యకర్తలు జ్ఞానప్రాప్తికి

నాలో ఏదో లోపము ఉండిఉంటుంది, అందుకుగాను ప్రాయశ్చిత్తము చేసుకొనవలసిఉంటుంది" అని భక్తిమార్గానురక్తుడైన ఏ ఒక్క భక్తుడూ అనుకోడు. చుట్టుప్రక్కలగల వారి స్వాతంత్ర్య కర్మలు కొన్ని ఉంటవి. కాబట్టి నా చిత్తశుద్ధిబాధ్యత నా మీద ఉండదు" అన్న అభిప్రాయము కలిగిఉంటాడు: ఒకరి భావపరిణామాల ప్రభావం మరొకరి పైన పడటం సహజము స్వభావ సిద్ధమూను. అయితే సమాజమూ వ్యక్తిమధ్య ఇటువంటి భేదభావాన్ని మేము గుర్తించము. పరిసర వాతావరణంపైన ఎంతవరకు ప్రభావం పడింది? మన విచార పరిణామం సమకాలీన పరిస్థితిపై ఏరీతిగా పడిందో ఇది గమనించటమే మనచిత్తశుద్ధికి గీటురాయి. మనం సత్యనిష్ఠాపరులము సత్యవాదులము అయినప్పుడు మన చుట్టుప్రక్కల ఉన్నవారు కూడా సత్యనిష్ఠాపరులు, సత్యవాదులు కావలెను. మనకు తెలియనీయకుండా వారు దాచేరహస్యమంటూ ఉండగూడదు. మనప్రక్కనున్నవాడు ఏదైన రహస్యంగా ఉంచదలుస్తున్నట్లయితే మన సత్యనిష్ఠలో మనసత్యోపాసనలోనే ఏదో లోపముండి ఉంటుందని భావించవలసి ఉంటుంది. అయితేపరిసర వాతావరణంపైనబడే పరిణామ ప్రభావమే మన చిత్తవృత్తికి గీటు రాయిగా ఎంచే ప్రతివారిపైనగూడా లోతుకు వెళ్ళి ఆలోచించవలసిన బాధ్యత పడుతుంది.

## ఆ హా ల్యా-రా మ న్యా య ము

"నాలో సత్యాభావము చాలా ఉన్నది" అని ఒక నాడు బాపూజీ అన్నారు. ఫలానావ్యక్తికి నావద్ద ఇన్నాళ్ళు

వున్నాడు, కాని నాతో చెప్పకుండా ఒకవిషయాన్ని రహస్యంగా దాచినాడు'' అని తనులో సత్యమెట్లాలోచించియుండో తెలుపుతూ పోదాహరణగా ఈవిషయం చెప్పినారు. ''నాఎదుట చెప్పడానికి ఆ వ్యక్తికి ధైర్యం కాలేదు. ఇతరులకది అదివరకే తెలిసిపోయింది: అయినా అతడునాకా సంగతి చెప్పలేదు. నేనేగనుక అకుంఠిత సత్యనిష్ఠగలవాడినయితే ఆమనిషికి ముందు నాదగ్గరికివచ్చి ఆవిషయం చెప్పాలని అభిప్రాయం కలిగియుండెడిది, ఇతరులముందు చెప్పడానికి ఎంత సంకోచముండినా నాఎదుట చెప్పడానికి సంకోచముండక పోయుండేది. తానుచేసిన పాపాలు దోషాలు ఏమున్నా తల్లికి పిల్లవాడు చెప్పుకున్నట్లు అతడునాకు చెప్పియుండే వాడు. కాని కథఅంతా అడ్డంనడిచింది. ప్రపంచంలో తనమిత్రులను కొన్న వాళ్ళ కనేకులకు చెప్పుకున్నాడు. నాకు మాత్రం చెప్పలేదు. నాలోసత్యము లేదనేకదా దీనిఅర్థం? నాలో సత్యమున్నపుడు నాదగ్గర ఉండేవారికందరికీ తమతప్పులొప్పుకొని నాఎదుట ఉన్నదున్నట్లు చెప్పివేయగలిగే ధైర్యముండవలసింది. కాపూ అన్నమాటలను శ్రద్ధగావిన్నాను. ఆపైన్నహామధ్య బాగాచర్చ జరిగింది. చర్చను నేనిక్కడ వర్ణించదలచుకోలేదు; కానివారి దృక్పథంలో సత్యాంశము లేకపోలేదనిమాత్రం గుర్తించినాను. అయితేఅందులో పూర్ణసత్యాంశము లేకపోవచ్చును. మనిషిప్రవృత్తికి పరిసర ప్రకృతికి మధ్యన ఉండేసంబంధం అహ్యాలా రామస్వామియం వలె ఉంటుంది. అహల్యా రామస్వామియమనుటలో నాఅభిప్రాయం

శ్రీరామ చంద్రుడు యాత్రా సందర్భాన ఒక ఆశ్రమానికి వచ్చేసినారు. అక్కడఉన్న ఒక పాషాణానికి శ్రీ రామచంద్రుని చరణ స్పర్శభాగ్య మబ్బింది. పాషాణరూపంలో శాపగ్రస్తురాలై పడిఉన్న అహల్య శాపవిమోచన అయింది అయితే ఎవరిదీ మహిమ? ఈ మహిమ రామచంద్రుని చరణ కమలములదని అంటే ఎన్ని బండరాళ్ళు ఆయన పాదాలను తాకలేదు. ఆ బండరాళ్ళలో నుంచి ఒక్క అహల్యే యందునా వెళ్ళలేదేమి! కాబట్టి అందుకు శ్రీరాముని చరణ స్పర్శది కాదు శాధ్యత. ఆగుణం అహల్య సుప్తావస్థలో పడి ఉన్నట్టి పాషాణముది అని అంటే కేలమంది పాదములు ఆపాషాణాన్ని తాకినవి. కాని ఏ ఒక్కరి పాదస్పర్శవల్ల కూడా అహల్యోద్ధరణ జరుగలేదు. కాబట్టి మహిమ ఆ పాషాణములో కూడా లేదు. అయితే కొంతమహిమ శ్రీరాముని చరణ స్పర్శలో ఉంది. కొంతమహిమ సుప్తావస్థలో ఉన్న అహల్యలోనూ ఉంది. ఈ రెండు మహిమల మేలు కలయికవల్ల అహల్యోద్ధరణ జరిగింది. బాధ్యత యావత్తూ కేవలం ఒకరిమీదనే వడవేస్తే పూర్తి న్యాయం జరుగదు. అందులో పూర్తిసత్యం కూడా ఉండదు.

## సత్యనిష్ఠ- తద్వ్యాపక ప్రభావము

ఈ విషయాన్ని నేనుబాపూతో చెప్పినాను. బాగా చర్చించుకొన్నాము. వాదోపవాదాల వివరణ అప్రస్తుతం. మన సత్యనిష్ఠ ప్రభావం పరిసర వాతావరణం మీద పడతా

నన్న అభిప్రాయం మన్నను అనుభావ్యస్తున్నది. వారి ఈ అభిలాష కేవలం మిథ్య అని త్రోసివేయడానికి వీలులేదు. కాని ఈ భావం భక్తిమార్గానుయాయులలో కనిపిస్తుంది. "ప్రపంచము ఈశ్వరేచ్ఛవలన నడుస్తున్నది. కాబట్టి మనము ప్రార్థించినంత మాత్రాన పులి తన స్వస్వరూపాన్ని విడి పిల్లిగా మారటమో లేక మాంసభక్షణవిడి పచ్చిగడ్డి మేసే గోవుగా తయారు కావడమో తప్పనిసరిగాదు గదా అని వీరి వాదన. ఒకభక్తుడు నాతో అన్నారు సాక్షాత్పరమేశ్వరుని సమక్షంలోనే తుచ్ఛులు, నీచులు, ఖలులు, దుర్జనులు ఇదిగా విహారం చేస్తున్నప్పుడు, అల్పుడను, తృణప్రాయుడను అయిన నా ఎదుట వారు తమ నైజగుణ ప్రాభవాన్ని బాహాటంగా ప్రదర్శిస్తూ ఉండడంలో ఆశ్చర్యమేమున్నది?" "నేను సర్వశక్తిమంతుడైన ఆ దేవదేవునికన్నా మించినవాడినా? సర్వవ్యాపకుడైన హరిహరునివల్ల బాగుపడనివారు నావల్ల ఏమి బాగుపడతారు? ఈశ్వరభక్తి ప్రపూరిత హృదయుడైన ఒకభక్తునిది ఈ ధోరణి. ఇది ఆయన భక్తిప్రపత్తుల తార్కాణం. అహంకారం లేశమాత్రమైనలేని పరమ నమ్రభావాలు ఇవి. ఈదృష్ట్యా ఇందులో సత్యాంశము లేకపోలేదు. కానిమనము సత్యాగ్రహుల మగుటవల్ల మనసత్యనిష్ఠ ప్రభావం పరిసరాల మీదతప్పని సరిగా పడవలసినదే అనిభావిస్తాం. సత్యాగ్రహ యోజనకు ఈ తాత్విక కల్పనయే మూలాధారం. సత్యాగ్రహ తత్వజ్ఞానంలో ఇదిమౌలికాంశం. ఈతత్వాన్ని మనంస్వీకరిస్తున్నప్పుడు మనపైబడు బాధ్యత అమోఘమైనది.

## సిద్ధాంతాల లోతుపాతులను గ్రహించుట

జీవితాన్ని మనం భక్తులకన్నా ఎక్కువ లోతుకు వెళ్ళి తరిచి చూడవలసి ఉన్నది. కాని అట్లు జరుగుటలేదు. మనం తత్వవిచారాధ్యయనము చేయనే చేయము. కొందరు అందుకు పూనుకున్నా గానీ, కేవలం మిడిమిడి జ్ఞానముతో సంతృప్తి పడుతున్నారు. భారతభూమి అనేక తత్వవిచారాలను తరిచి చూచినగడ్డ. ఇక్కడ జ్ఞానం ఆధారంగా ఏదీ ప్రాచుర్యాన్ని పొందజాలదు. మన మొకవేళ ఆగ్రహంతో మనసిద్ధాంతాలను నిలుపదలచినట్లయితే అవి మనమట్టుకు మాత్రమే నిలిచిపోతవి. అంతేకాని భారతదేశమంతటా అవి రూఢి కావు. భారతదేశము తత్వజ్ఞాన ప్రదేశమన్నది విస్మరించరాదు. బౌద్ధధర్మము ఈ ప్రయోగము నొకసారి చేసిచూసింది. పరిణామతః బౌద్ధధర్మం కొన్ని ఆచార వ్యవహారాల వరకు మాత్రమే పరిమిత మైపోయింది. భారతదేశం బౌద్ధమతానికి కేవలం జన్మభూమి కాగలిగింది. అంతేకాని బౌద్ధమత మిక్కడ స్థిరంగా ఉండలేకపోయింది. దానికి కారణం మౌలిక తత్వజ్ఞానాన్ని జీర్ణించేసుకొనకపోవుటయే. కాబట్టి ఏసిద్ధాంతమైన స్థిరంగా ఉండాలంటే అందుకు దానిలోతుపాతులను వ్యాపకానికి తీసుకురావడం చాలా అవసరం. బౌద్ధమతము ఆపని చేయకపోవుటవల్ల జన్మభూమి అయిన భారతదేశములోనే స్థిరంగా ఉండలేకపోయింది. విషయమది. ఇక అందులో వడదలచుకోలేదు. భగవద్గీత సాంతం యుద్ధభూమిలో అర్జునునికి కలిగిన ఒకసందేహం ప్రశ్నరూపంలో ఉద్భవించింది. ఆప్రశ్నకు సమాధానం

ఎంత సుదీర్ఘమైనది! ఎంతలోతుగా తత్వవిచారణ కనిపిస్తుంది గీతలో మనకు? క్షేత్రక్షేత్రజ్ఞ విచారణ దేనికది వేరుపరచ బడింది. ప్రకృతి పురుషుల ప్రస్తావన వచ్చింది. ఆత్మస్వరూపుని వర్ణనకూడా అందులో ఉన్నది. ఒకటిరెండుకాదు, ఎన్నోవిష యాలు గీతలో చర్చింప బడినవి. ఇంతసూక్ష్మ సంశోధన జరిగిన తర్వాతగాని అర్జునవిషాదయోగము అంతరించలేదు, అప్పుడుగాని మోహనివృత్తి అయి కర్తవ్యంపైన బుద్ధిస్థిరం కాలేదు. ఒకచిన్న ప్రశ్నకోసం ఇంతసూక్ష్మ తత్వపరిశీలన ఎందుకు జరుగవలసి వచ్చిందంటే, భారతదేశపు ప్రత్యేకత అది. కాబట్టి మనలో ఉలోపాన్ని దూరంచేసు కొనుట చాలా అవసరం. మనమీలోపాన్ని దూరంచేసినప్పుడే సాధించదలచిన మనకార్యాలను సాధించగలము.

'ఎవరికివారే యమునాతీరే'

మనలో ఉన్నమూడో లోపాన్ని గురించి చెప్పవలసి ఉన్నది. ఈవిషయమును గురించినా మొదటిప్రసంగంలో కొంత వరకు తెలిపివున్నాను. ఆదేమిటో చెపుతున్నాను. మనంశక్తి హీనులముకాము. ప్రజలుకూడా మనవంక ఆశావహంగాచూస్తు న్నారు.

మనలో అందరూ ఎవరిశక్తికి దగ్గపనిని వారుచేస్తూ పోతున్నారు. కాని, 'ఎవరికివారే యమునాతీరే' అన్నట్లుంది మనపని. ఒకరుచేస్తున్న పనివిషయం మరొకరికి తెలువనే తెలువదు. పరిణామతః పనినిగురించి తెలుసుకొనుటకు ప్రయత్న మ స్వరూపము గోచరించదు. మనలో కొందరు శైలమును

సేకరించి నాగసుకోండి. వారిదగ్గర నూనెసీసాలుఉండి, మరొ కరి దగ్గరఅగ్గిపెట్టెలు స్టౌగ్రా. ఇంకొకరివద్ద కందిళ్ళు, లాంత ర్లు సమకూర్చబడి ఎక్కడి వస్తువులక్కడనే పడిఉండినప్పుడు ఉపయోగ కరమైన వస్తువులుకూడా నిరుపయోగము లైనట్లే కదా. అవిఅన్నీ ఒకచోటికి చేర్చబడి ఉపయోగ పరచబడి నప్పుడుకదా. అంధకారాన్ని భేదించేది! లేనట్లైతే అంధకారం అట్లేఉంటుంది. నూలువడకు సంఘాలు స్థాపించ బడుతవి. అంతావారాని కొకసారి ఒకచోట కూడుతారు. ఏదోకొంత సేవ నడికినట్లు చేస్తారు. తర్వాత తమతమ ఇండ్లకు వెళ్ళిపో తారు. నలుగురిలో వారిప్రచారం జరుగకపోయేసరికి వారికి నిరుత్సాహం వస్తుంది. ఆరంభంలో కనిపించినఉత్సాహం తరు వాత కనిపించుటలేదు. 50 నూలువడకు సంఘాలు స్థాపిత మైనవి. అందులో 25 సంఘాలు పడిపోయినవి. మిగిలిన 25 సంఘాలు ఏదోకొంత పనిచేస్తున్నవి. కనీసంఅవి పనిచేస్తున్న ట్లయినా ఇతరులకెవరికీ తెలియకుండా ఉంటుంది. ఇకమరి గ్రామపరిశ్రమలు నడుస్తూలేవని అంటే దానిబాధ్యత చరఖా సంఘంమీాద లేనట్లేకదా! అయితే ఈవిధమైన అస్తవ్యస్తపు పని కొనసాగు తుండడం ఏమాత్రం హర్షించ తగ్గదికాదు. అదిపూర్తిగా బలహీనమైన సంగతి అందరికీ తెలును. అయినా అది నాలుగయిదు సంవత్సరాలనుండి నడుస్తూనేఉంది. ఎప్పు డైతే మన మొక గొప్పపనిని సాధించవలెనని పట్టుబట్టినామో, అప్పుడు పూర్తిశక్తిని కేంద్రీకృతంచేయడం చాలాఅవసరం. కాబట్టి ఈవిషయాన్ని ప్రజలదృష్టికి తెస్తున్నాను. ఈదేవిష యంపై జయప్రకాశనారాయణగారు కూడాతమ అభిప్రాయా

న్ని ప్రకటిస్తూ అంతా కలిసి ఒకసంఘంగా ఏర్పడితే మంచిదనిఅన్నారు. ఇవన్నీ చిందరవందరగా పనిచేస్తుంటే వాటినుండి శక్తి ఉత్పన్నంకాదు. శ్రీ జయప్రకాశ్ గారు ఇచ్చిన ఈసలహా వారి సుహృదయాన్ని సన్మిత్రతను తెలుపుతున్నది. వారి సలహాపైన చాలాశ్రద్ధగా ఆలోచింప బడుతున్నదని తెలుపుటకు నేనుసంతసిస్తున్నాను. కొన్నాళ్ళైన తరువాత ఏకైక సంస్థ సర్వసేవా సంఘం ఏర్పడుతుంది. మిగతా సంఘాలన్నీ అందులో విలీనమవుతవి. ఆనిర్ణయం జరుగుటలో నే ప్రజల ఎదుట పెట్టబడుతుంది. ఈలోపాలు చిన్నచిన్న కార్యకర్తలవి కావు, ముఖ్యకార్యకర్తలే దోషులు అని నేననుకుంటాను. ఎందుకంటేవారు నిర్ణయించిన దారినే ఇతరులు అనుగమిస్తారు. ముఖ్యకార్య కర్తలుముందే సరియైన దారిఏర్పరచి ఎక్కడ ఏపని జరిగిన అదిసర్వసేవా సంఘం పక్షాన జరుగవలసిందే నన్న నిర్ణయాన్ని అమలు పరచి ఉన్నట్లయితే ఈ అనైక్యత అస్తవ్యస్తత ఉండక పోయేదికదా! అటువంటప్పుడు ఎక్కడా కేవలం నూలువడికే సంఘం ఏర్పడదు. సర్వసేవాసంఘశాఖ ఏర్పడి సర్వోదయ కార్యక్రమాన్ని అమలు పరుస్తుంది. అప్పుడు ఒక్క నూలు వడకడమే గాక, గ్రామపరిశ్రమలఅభివృద్ధి, ఆధునిక విద్యా బోధన, హరిజనసేవ మొదలైన పనులన్నీ ఆ శాఖద్వారా జరుగుతవి. ఏదైనా శాఖలో అక్కడి కార్యకర్తయొక్క అభిరుచి, శక్తిసామర్థ్యాలను బట్టి ఒక ప్రత్యేక కార్యరంగంలో ఎక్కువ ఇతర రంగాలలో తక్కువ, పని జరుగుట సంభవించవచ్చు అది అక్కడి వాతావరణం స్థానిక అవసరాలనుబట్టి ఉంటుంది. అయినప్పటికీ, ఎక్కడ

కేంద్రం తెరువబడినా గానీ అది సర్వసేవా కేంద్రమే అయి ఉండగలదు. కార్యక్రమ నిర్వహణాలో ఒక సమైక్యత ఏర్పడుతుంది. నేనిప్పుడే చూపించిన దోషం దూరమై పోతుంది. ఈవిధంగా జరిగితే అంతా కలిసి పనిచేయుటకు అవకాశమేర్పడుతుంది. లేనట్లయితే ఏదో కొన్నాళ్ళు నడిచి కార్యక్రమము సంఘము అంతా సమాప్తమైపోతుంది.

# దైవ ప్రార్థన



చివరి కింకొక మాట చెప్పవలసి ఉన్నది. మనం ప్రతి దినము ప్రొద్దున, సాయంత్రము చేసే ప్రార్థన అంత సంపూర్ణంగానూ, అంతరంగాలను తృప్తిపరిచేవిగానూ లేవని చాలా ఆలోచన తర్వాత తెలుసుకున్నాను. అనేక సంవత్సరాలలో అవి కేవలము ఒక సదాచారముగనో లేక శిష్టాచారముగనో నాకు జరుగుతూవున్నట్లు నేను ఎన్నోసార్లు గమనించినాను. సదాచారము మంచిదే. కాని ప్రార్థన కేవలము సదాచారమువలె చేసినట్లయితే, వినిర్మలమైనట్టి హృదయంతో చేసిన ప్రార్థన వల్ల కలిగే అనుభవానికి అది సాటిరాదు. బాపూజీ తమ జీవితకాలంలోనేగాక తమ మృతివల్లకూడా మనకీ విషయమై అమూల్యమైన పాఠం చెప్పిపోయినారు. వారు చెప్పిన పాఠం మనకీపట్ల సరియైన మార్గదర్శకత్వం వహించగలదు. చివరకు వారు దేహాన్ని పరిత్యజించే సమయానకూడా వారు ప్రార్థనోన్ముఖులై యుండిరి. ప్రార్థనాభిముఖులై యున్నప్పుడే వారు దేహపరిత్యాగం చేసినారు. తుపాకిగుండు వారి శరీరానికి తగులగానే "హే రామ్, హే రామ్" అని పరమేశ్వర నామమును ఉచ్చరించినారు. ఇదేమైనా సామాన్యమైన విషయమనుకున్నారా? వారు నిరంతరము జాగ్రదవస్థలోనే ఉండేవారు, రెండుసార్లు ప్రార్థనచేసేవారు. సదాచారమువలె

గాను! స్వచ్ఛమైన హృదయముతో, నిర్మలమయిన హృదయముతో, ప్రార్థన సమయంలో పూర్తిగా తన్మయులై పోయినారు. వారంటూ వుండేవారు; ప్రతివిశ్వాసి హృదయములోనూ 'నేను ప్రార్థనా నిమగ్నుడనయే ఉంటాను' అని ప్రార్థన వారికి అలంకారమూ కాదు, లేక అదేదో కల్పన వంటి దని కూడా కాదు; వారి జీవితములో ప్రార్థన ముఖ్యాతి ముఖ్యమైన వస్తువు అయితే మనం చేసే ప్రార్థన శిష్టాచారం క్రింద పడిపోతున్నది. సహజ మనముతో ప్రార్థన చేయక పోవటమే గాక ఆ అంతస్సుకు మనం వెళ్ళటలేదు. ఇక్కడే చూడండి సాక్ష్యము ఇక్కడ భోజన సమయాల్ని చక్కగా వేసి పెట్టినాముకదా! తాలిమి సంఘముమండలి, ఆశాదేవి ఇలాగా విహారాలవారంతా కలిసి శ్రమపడటంవల్ల మనకు అన్నం దొరికింది. అయితే తిండికి ఇంతా చేసి దైవప్రార్థనకు ఏపాటి ప్రయత్నాలు చేసికొంటున్నాము? ఏపాటి దైవ చింతన జరిగింది? ఏదో ప్రార్థన అని చేసినాము. కాని దానికి ప్రత్యేక సన్నాహాలు ఏవీ చేయవలసి రాలేదుకదా! కాబట్టి భోజనంకోసం అవసరమనట్లు ప్రార్థనకోసం పడనక్కరలేదు. అయితే ప్రార్థనకొరకు బాహ్యప్రయత్నాలేవీ అవసరం లేదని తెలుసుకొన్నాం. ప్రార్థన కేవలం ధ్యానంచేసేవట్లో అంతరంగం నుండి జరుగవలసిన పనిమాత్రమే. అందుకు అంతఎక్కువ సమయం కూడా వ్యయంచేయ నక్కరలేదు. ఆ కాస్త అయినా చేస్తే అందువల్ల మనఆత్మ బలం అభివృద్ధి చెందుతుంది. కానుకాను కఠినాతి కఠినమైన సమస్యలను మనంస్వీకరించినకొద్దీ, వాటిని పరిష్కరించేందుకు మనకెక్కడినించి శక్తి వస్తుందో ఏమాత్రం

నీవీ లోకంలో అసత్యంచేత నీ శరీరాన్ని కాపాడుకొనగలవు. కాబట్టి పరలోకంలో నీకు అందువల్ల దొరికేదేమీ లేదు. పర లోక భాగ్యాన్ని నీవు కాలదన్నుకొంటున్నావు. ఈప్రపంచము ఈ జీవితము మూడునాళ్ళముచ్చట. దీనిపైన స్థిరమైనటువంటి ప్రపంచముఉంది. లోభములో పడి క్షణికలాభాన్ని ఆశిస్తూ ఉన్నావు. క్షణికముకొరకు స్థిరత్వాన్ని వదలుకొంటావా? అని మన పూర్వజులు అధర్మబుద్ధిని మందలించేవారు. కాని అది బాల భాషవంటిది. బాలభాషఅంటే అవికసిత మైనటువంటి భాష. వికసితమైన భాషలో చెప్పాలంటే, 'అసత్యంవల్ల అంతః స్సమాధానము లభించదు. అంతస్సమాధానము లభించని ఆత్మ పరితృప్తి ఏర్పడదు. అని చెప్పవలసి ఉంటుంది. అయితే ఈ అంతస్సమాధానము లభించనప్పుడే పరలోకము అంటే మృత్యువు అనంతరముఉండే లోకముయొక్క ప్రసక్తి వస్తుంది. కాబట్టి మీరు ఆత్మ పరితృప్తిపైనైనా నిర్భరులు కాండి. లేదా పరలోక జీవితముపేరునైనా తలచుకోండి. ఎట్లైనాసరే సత్యధర్మ నిష్ఠానువర్తనులై ఉండుట ముఖ్యం. ఇందుకు ప్రేరణ లభించుటకు "పరలోకం" ఆత్మానందము "ఆత్మ పరి తృప్తి" మొదలైనవాటిలో ఏ మాటను మనః ఫలకముమీద చిత్రించుకొన్నా సరే. ఎవరెవరి సత్యధర్మానువర్తన వారి వారి తత్త్వ విచారస్థాయినిబట్టి ఉంటుంది. సత్యనిష్ఠ బల పడుటకుగాను అందుకు ప్రేరణనొసగుటకు అంతఃస్సమాధానాన్ని మించినదేదీ లేదని నా విశ్వాసం. అయితే పరలోకమును ఆధారముగా గొన్నవారు తప్పుచేసినారని నేననుకోను. దేనిని ఆధారంగాతీసుకొన్నా అవిచలమైనసత్యనిష్ఠను ప్రజాహృదయము

# శుద్ధి

## పరిచయము, ప్రస్తావన

| | తప్పు | ఒప్పు |
|---|---|---|
| ౮ వ పేజి, వర్తిక శ్రమ, గౌతమము, పంక్తులు ౯ ౧౦ | మానవాతీతమైన శక్తిగలవాతము కావున | మానవాతీతమైన శక్తిగల వారము కాము కావున |